# శ్రీ పరాశర సంహిత

# శ్రీ ఆంజనేయ చరిత్ర

ప్రథమ పారిజాతము

సమర్పణ :

"వైద్యవిద్వాన్", "భాషాప్రవీణ", "హిందీ విశారద"
శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి, M.A., P.O.L.

ప్రచురణ :

శ్రీ హనుమత్సేవా సమితి

సత్యనారాయణపురం : విజయవాడ-520 011

హోమియో వైద్యంలో అశేషప్రజానీకమునకు విశిష్టమైన సేవచేయుటయే గాక హనుమదుపాసనలో మంచి స్థితిని పొందారు. 30 సంవత్సరాలు నిర్విరామ కృషి సలిపి 7-4-1977న పరమపదించారు.



డాక్టరు: **ధర్మాల సూర్యనారాయణ** గారు

జయరామకృష్ణా హోమియో స్టోర్సు

గాంధీచౌక్ :: తెనాలి.

వీరి ఆత్మకు శాంతిచేకూరాలని ఆ హనుమత్స్వామిని ప్రార్థిస్తున్నాము.

—కుమారులు, కుమార్తెలు,

సన్నిహిత బంధుమిత్రులు.

## —* విషయ సూచిక *—



ఈరూపు నీయఁ గని నా
కీ రీతిగ హానుమ నెంచు ప గిత [illegible] సీ
తా రామాంబా లక్ష్మీ
నారాయణులన్ పితరుల [illegible]ఁ గొలుతున్.

— అ[illegible] చిదంబరశాస్త్రి.

నమస్కృతులు—

"యద్యత్ర సౌష్ఠవం కించిత్ తద్గురో రేవమేవ హి
యద్యత్రాఽసౌష్ఠవం కించిత్ తన్మమైవ గురో ర్నహి ॥"

అన్నట్లు శ్రీ పరాశర సంహిత వెలువడుటలో సర్వ విధ కృషి సల్పిన శ్రీ గురుస్వాముల సహకార సంపత్తుతో విశేషమైనవిగాని నా ప్రమేయ మత్యల్పము. సమితి ఈ సంహితా ప్రచురణ స్వీకరించుటలో నుద్దేశ్యము వ్రాతప్రతు లలో శిథిలమగుచున్న హనుమ ద్విషయమును లోకమున కందించుట మాత్రమే.

ఇంతవరకు వెలువడిన 9 పారిజాతములు, వివిధప్రాంత ములలో, మహనీయులచే ఆవిష్కరింపబడినవి. ఈ 10వ పారి జాతము నా గురుదేవులైన బ్రహ్మశ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శర్మగారిచే ఆవిష్కరింపబడుట, నా అనేక జన్మల అదృష్టము గా భావిస్తున్నాను.

శ్రీ పరాశరసంహిత ఈరూపము దాల్చుటకు విశేష కృషిసల్పిన ఆత్మీయులు శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి గారికి, శ్రీ గురుదేవులగు బ్రహ్మశ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశర్మ గారికి, ఈ పారిజాత ముద్రణకు చేయూతనిచ్చిన దాతలకు, సకాలమునకు ముద్రించిన బ్ర॥శ్రీ ఆకెళ్ళ రామంగారికి అనేక నమస్కృతు లందించుచున్నాను.

భవదీయ

— లక్ష్మణరావు.

# శ్రీ ఆంజనేయ చరిత్ర

[ శ్రీ పరాశర సంహితా ]

షట్ చత్వారింశత్పటలః

## హనుమత్పాతాళలంకాప్రవేశ కథనం

[పూర్వవృత్తాంతము :— మాయావియగు మైరావణుడు రామలక్ష్మణులను పాతాళ లంకకు తీసుకొని పోయెను. ఆతడు వారిని దుర్గకు బలిసేయనెంచి తనచే బంధింపబడియున్న తన సోదరియగు దుర్దండిని నీటిని తెచ్చుటకై పంపెను. రామలక్ష్మణుల కొఱకై బయలుదేరిన హనుమంతుని ఆమె కోనేటికడ చూచి తన దీనగాథ చెప్పుకొనెను.]

శ్లో॥ ఇతి తస్మై సమావేద్య దుర్దండీ దండవ ద్భువి ।
భావికార్య మజానన్తీ పపాత్ాశ్రుముఖీ సతీ ॥

తా॥ అని పూర్వోక్తరీతిగా దుర్దండి హనుమంతునకు రామలక్ష్మణుల విషయము, తన విషయము తెల్పి తాను ముందు చేయనగు కార్యమును కూడ మరచి అశ్రువులతో నిండిన నేత్రములు కల్గి దండమువలె భూమిపై పడెను

శ్లో॥ తా ముత్థాప్య కపిశ్రేష్ఠః ప్రోవా చేదం వచస్స్మితః।
ఏహి దుర్దండి! భద్రం తేమాభూ త్తే మనసో వ్యథా॥

తా॥ వానరశ్రేష్ఠుడగు హనుమంతుడామెను లేవదీసి ఇట్లు పల్కెను. ఓ దుర్దండీ! వినుము. నీకు శుభమగుగాక. మానసిక బాధ కలుగకుండుగాక!

శ్లో॥ అద్యప్రభృతి మా భైషీః భవితా సుఖితా స్వయం
హనూమన్తం చ మాం విద్ధి రామకార్యార్థ మాగతమ్॥

తా॥ నేటినుండి భయపడవలదు. సుఖమే ముందు జరుగగలదు. నన్ను రామకార్యార్థమై వచ్చిన హనుమంతునిగా తెలిసికొనుము.

శ్లో॥ మా కృథా స్సంశయం చాత్ర మమ ధర్మేణ తే శపే।
అధునా స్వర్ణకుంభేన జల మానయ భామిని॥

తా॥ ఈ విషయమున సందేహము వలదు. ధర్మముగా మాట ఇచ్చుచున్నాను ఓ వనితా! ఇప్పుడీ బంగారు కుండతో నీటిని తీసికొనిరమ్ము.

శ్లో॥ మైరావణ మహం హత్వా లోకకంటక మాహవే।
రాజ్యార్హం నీలమేఘం వై త్వత్పుత్ర మభిషేచయే॥

తా॥ లోకకంటకుడగు మైరావణుని నేను యుద్ధమున సంహరించి రాజ్యమునకు అర్హుడగు నీ కుమారుని నీలమేఘుని రాజ్యాభిషిక్తుని చేయగలను.

శ్లో॥ సహై వావాం గమిష్యావః మైరావణపురం ప్రతి।
ఇతి దత్తాభయా సాధ్వీ హనూమ న్త మువాచ సా॥

తా॥ మైరావణ పురమునకు మన మిర్వురము కలిసియే

వెళ్ళుదము అని హనుమంతు డభయ మీయగా సాధ్వియగు దుర్దండి హనుమంతునితో ని ట్లనెను.

శ్లో॥ సత్య మేవం త్వయోక్తం వై శరణాగతవత్సల ।
కిం తు తస్య పురం ధీమన్ దుష్ప్రవేశం సురాసురైః ॥

తా॥ ఓ శరణు జొచ్చినవారి యెడ వాత్సల్యము కల వాడా ! నీవు చెప్పినది యదార్థమే, కాని బుద్ధిమంతుడా ! ఆ మైరావణుని పట్టణము సురాసురు లెవ్వరికిని ప్రవేశింప వీలుకానిది.

శ్లో॥ శంభో ర్వరప్రసాదేన తపసా తోషితస్య చ
అస్తి తస్య పురద్వారి తులా సూక్ష్మ వినిర్మితా ॥

తా॥ తపస్సుచే సంతోషపెట్టబడిన పరమ శివుని వర ప్రసాదము వలన ఆతని పట్టణ ద్వారమున సూక్ష్మమగు త్రాసు నిర్మింపబడినది.

శ్లో॥ త్వాం మారుహ్య విశే ద్బాహ్యే నిర్గచ్ఛే ద్వా తదన్తరః।

తా॥ నీవు ప్రవేశించినంతనే త్రాసుయొక్క అంత ర్భాగము వెలుపలకు వచ్చును.

శ్లో॥ కిం తు మైరావణీయానాం పదాతి రథ వాజినాం ।
గజానా ముష్ట్ర వాహినీనాం గతాగమనయో రపి ॥

తా॥ కాని మైరావణ సంబంధమైన పదాతిదళముకాని, రథములు, గుఱ్ఱములు, ఏనుగులు, ఒంటెలు, ఆడు గుఱ్ఱ ములు మున్నగునవి వెళ్ళుచున్నను, వచ్చుచున్నను-

శ్లో॥ న భంగ మత్ను తే చైషా న కంపం నాతిస్వనం ।
న భ్రంశో వాపి గన్తౄణాం మహాదేవ ప్రసాదతః ॥

తా॥ పరమశివుని అనుగ్రహ కారణమున ఆ త్రాసు వంగుటకాని, వణకుటకాని, ధ్వనిచేయుటకాని, విరుగుటకాని, జరుగదు.

శ్లో॥ సూక్ష్మాణా మపి జన్తూనాం మైరావణ విరోధినాం ।
గతాగమనయో స్సద్యః తులాభంగో భవే ద్ధ్రువమ్ ॥

తా॥ మైరావణుని విరోధులయినచో సూక్ష్మప్రాణి యైనను వెడలినను, వచ్చినను వెంటనే తప్పక ఆ త్రాసు వంగిపోవును.

శ్లో॥ భంగే తులాగుణే తస్మి న్నారూఢేసతి తేఽ ప్యథ ।
సంజాయతే మహాశబ్దో భే ర్యాఘూతో రణే యథా ॥

తా॥ త్రాసు వంగగా ఆ గుణము పైకిలేవగనే యుద్ధరంగమున భేరి మ్రోగునట్లు గొప్ప శబ్ద మేర్పడును.

శ్లో॥ శ్రుత్వా త మతులం శబ్దం మైరావణ భటాః క్రుధా ।
అథాయుధా రణోత్సాహా వేష్టయేయు స్సమ న్తతః ॥

అట్టి గొప్ప శబ్దమును విని మైరావణ భటులు కోపముతో ఆయుధములు ధరించి రణోత్సాహులై అన్ని వైపుల చుట్టివైతురు.

శ్లో॥ తాన్ దృష్ట్వా శతశో వీ రాన్ తులాభ్రష్టః పరఃపుమాన్
బిభిర్యా దతిధీరోఽపి త్యజేద్వా ఽక్లబో వ్యసూన్ ॥

తా॥ వందలకొలది వచ్చిన వీరులను చూచి త్రాసు నుండి భ్రష్టుడైన ఆ శత్రుపురుషుడు ఎంతటి ధీరుడైనను భయమందును. లేదా కలతబొంది ప్రాణములనే విడచును.

శ్లో॥ తస్మా దిదం పురద్వారం మైరావణవిరోధినా
గంతుం న శక్యతే నూనం త్వయా మతిమతాంవర ॥

తా॥ ఓ బుద్ధిమంతులలో శ్రేష్ఠుడా! పై కారణమున మైరావణ విరోధియగు నీవు ఆ పట్టణద్వారము దాటి వెళ్ళుట శక్యము కాదు.

శ్లో॥ ఇతి తస్యా వచ శ్శ్రుత్వా హనుమా నుష్ట్రవాహనః ।
విస్మయం పరమం భే పరమాశ్చర్య వర్ణనాత్ ॥

తా॥ అని దుర్దండి మాటలనువిని ఒంటె వాహనముగా కల హనుమంతుడు అటువంటి ఆశ్చర్యకరమైన వర్ణన వలన విస్మయమందెను.

శ్లో॥ కపిః ప్రోవాచ దుర్దండీం పురదర్శన కౌతుకః ।
మాం ప్రాపయ పురం సాధ్వి ఘటే ధృత్వా ప్రయత్నతః॥

తా॥ మైరావణ పట్టణమును చూచుట యందుత్సుకత కలవాడై హనుమంతుడు దుర్దండితో నిట్లనెను. ఓ ఉత్తమురాలా! ఈ కుండయందు నన్ను ధరించి ఆ పట్టణమునకు చేర్చుము.

శ్లో॥ శమీపత్రప్రమాణం చ కరిష్యే దేహ మీశ్వరం ।
తులారోహణ వేళాయాం భంగ స్తస్యాభవే ద్యది ॥

తా॥ ఈ నా దేహమును జమ్మి ఆకంత చిన్నదానినిగా చేయుదును. ద్వారముకడ త్రాసునందు ప్రవేశించువేళ కదివంగిన యెడల.

శ్లో॥ జలపూర్ణ మపి స్వర్ణం ప్రాప యాంతః పురే ఘటం ।
తదా హ్యహం కృతార్థస్స్యాం తవాప్యర్థోఽపి భవిష్యతి॥

తా॥ నీటితో నిండిన ఈ బంగారు పాత్రను అంతః పురములోనికి చేర్చుము. అప్పుడు నేను కృతార్థుడ నౌదును. నీ కోరికయు నెరవేరగలదు.

శ్లో॥ మధురం వచనం వాక్యం శ్రుత్వా సా ప్రముమోదహ॥

తా॥ ఇటువంటి హనుమంతుని తీయని మాటలు విని దుర్దండి పరమానందమందెను.

శ్లో॥ ఇత్యేవ ముక్త్వా వచనం కపీన్ద్రః
శమిచ్ఛదాకారధరో హి విద్వాన్ ।
జలాప్లుత స్వర్ణ ఘటో కపాలకం
సమాలలిం గాచ్యుతవిక్రమ క్రమః ॥

తా॥ పై రీతిగా హనుమంతుడుపల్కి సర్వజ్ఞుడగు నాతడు జమ్మి ఆకంత ఆకారము ధరించి జలపూర్ణమగు స్వర్ణఘటమును చేరి మొక్కవోని పరాక్రమముకల ఆతడు కుండ పెంకును పట్టుకొనియుండెను.

శ్లో॥ తథావిధం సూక్ష్మశరీరధారిణం
కపీశ్వరం స్వర్ణ ఘటాశ్రయాన్తరం ।
బభార హేమాచలదుర్భరం హి సా
న సోఽపి సత్త్వే లఘు రల్పమాత్రకః ॥

తా॥ అట్లు సూక్ష్మశరీరము ధరించి కుండ లోపలి భాగము నాశ్రయించియున్న వానరేశ్వరుని మేరుపర్వతము వలె భరింప శక్యముకాని వానిని దుర్దండి భరించెను. హనుమంతుడు స్వల్పరూపము ధరించినను బలమున తేలికకాడు.

శ్లో॥ తథాపి సా భావిశుభానుసారతః
ప్రయత్నతో నీరఘటం సుబిభ్రతీ।
తులావశా ద్దుర్ఘట శత్రుఘట్టనం
ప్రాకార మాద్యం ప్రథమం జగామ వై ॥

తా॥ అయినను ముందు జరుగవలసిన శుభముల ననుసరించి ప్రయత్న పూర్వకముగా ఆ నీటికుండను ధరించి నదై త్రాసుకారణమున శత్రువులు ప్రవేశించుటకు శక్యము కాని తొలి ప్రాకారమునందు మొదట ప్రవేశించెను.

శ్లో॥ తత స్తులాభంగ విశంకినీ స్వయం
స్ఖల త్పథ న్యాస విలాస మంథరా।
నిరంతరాయాం కురు కార్య సిద్ధయే
కపే రితి ధ్యాత నిజేష్ట దేవతా ॥

తా॥ అంత నామె తులాభంగము జరుగునేమోయను భయమున తొట్రుపడుచు మెల్లగను విలాసముగను నడచుట మాని హనుమంతుని కార్యసిద్ధికొఱకై ఏ ఆటంకము కల్గించ వలదని తన ఇష్టదేవతలను ప్రార్థించసాగెను.

శ్లో॥ నిధా యాంఘ్రిం తు దుర్దండీ తులా ప్రథమకర్మతే।
యస్మి న్నపరం కర్మ చక్రే బుద్ధిం సునిశ్చయామ్ ॥

తా॥ త్రాసుచే సన్నద్ధమైయున్న ప్రథమ ద్వారమున దుర్దండి పాదము నుంచి నిశ్చయమైన బుద్ధితో కర్మ నాచరింప నెంచెను.

శ్లో॥ తద్వారోర్ధ్వ కపిస్పర్శాత్ భజ్యమానే తులాగుణే।
సంజాతో నిష్ఠుర శ్శబ్దః వజ్రాశనిసమ ధ్వనిః ॥

తా॥ విరోధియగు వాని స్పర్శ కలుగగనే ప్రాసుములు వంగిపోగా పిడుగుపాటుతో సమానమైన ధ్వని కల భరింపరాని శబ్దము వెడలెను.

శ్లో॥ తేనశబ్దేన మహతా దుర్గండీ రాక్షసీ భయాత్ ।
జలపూర్ణం ఘటం శీఘ్రం ప్రాకారాన్తర్వ్యక్షిపేత్ ॥

తా॥ ఆ భయంకరమైన శబ్దముచే రాక్షసియగు దుర్గండి భయమంది వెటనే నీటితో నిండియున్న ఆ కుండను ప్రాకారము లోపలకు చేర్చెను.

శ్లో॥ అథాస్మిన్నంతరే క్రూరా రాక్షసా ద్వారపాలకాః ।
మహాశూరా మహేష్వాసా తులాద్వారతలే స్థితాః ॥

తా॥ ఇంతలోనే ద్వారపాలకులుగా నున్న క్రూరులు, గొప్ప పరాక్రమవంతులు, పెద్దవిల్లు కల్గినవారు, తులా ద్వారము కడ నున్నవారు అగు రాక్షసులు.

శ్లో॥ కాంశ్య లోహమయాకారాః షష్టికోట్యో మహారథాః।
ఊర్ధ్వవక్త్రో భేరివచ స్త్రిశిరో వ్యోమవీక్షణాః ॥

తా॥ కంచు, ఇనువంటి ఆకారములు కలవారు, అరువదికోట్ల మహారథులు, ఆకాశమువైపు తలకలవారు, భేరి వంటి మాటలుకల్గినవారు, మూడుతలలు కలవారు, ఆకాశ వీక్షణములు కలవారు.

శ్లో॥ శార్దూలముఖనామ్నా చ తథా గార్ధభనిస్వనః ।
శతజిహ్వో దీర్ఘజిహ్వో శ్వాముఖో వక్రనాశికః ॥

తా॥ శార్దూలముఖుడను పేరుకలవాడు [పులిముఖం కలవాడు] గార్ధభస్వనుడు [గాడిద అరుపు కలవాడు] శత

జిహ్వుఁడు [వంకి నాలుకలు కలవాఁడు] దీర్ఘజిహ్వుఁడు [పొడవైన నాల్కవాఁడు] శ్వముఖుఁడు [కుక్కమూతివాఁడు] వక్రనాసికుఁడు [వంకరముక్కువాఁడు].

శ్లో॥ వ్యాఘ్రాస్య శ్శూలదంష్ట్రశ్చ ధూమనేత్ర శ్చతుర్ముఖః।
హస్తికర్ణః ఖడ్గరోమా రక్తాక్షో దీర్ఘరోమకః ॥

తా॥ పులిమూతివాఁడు, శూలములవంటి కోరలు కలవాఁడు, పొగకండ్ల వాఁడు, నాల్గు ముఖములవాఁడు, ఏనుగుచెవివాఁడు, కత్తి వెండ్రుకలు కలవాఁడు, ఎఱ్ఱని కండ్లవాఁడు, పొడువగు వెండ్రుకలవాఁడు

శ్లో॥ సర్పరోమా జంబుమాలీ కాలాన్తః కాలకింకరః ।
అగ్నివర్ణో విరూపాక్షః తథా వృశ్చికరోమకః ॥

తా॥ సర్పరోముఁడు జంబుమాలి, కాలాన్తకుఁడు కాలకింకరుఁడు, అగ్నివర్ణుఁడు, విరూపాక్షుఁడు, వృశ్చికరోమకుఁడు.

శ్లో॥ ఏవమాద్యా మహామాయా శ్శత శోథ సహస్రశః ।
తులాశబ్దహతా స్తూర్ణ మశ్వా ఇవ కశా హతాః ॥

తా॥ మొదలగు గొప్పవారు వందలకొలది, వేలకొలది తులాశబ్దముచే తెలుపబడి కొరడాతో కొట్టబడిన గుఱ్ఱములవలె పరుగిడుచు-

శ్లో॥ విరోధిజన సంచార శంకా వ్యాకుల మానసాః ।
సాయుధా స్సపరీవారః తం దేశం సముపాగతాః ॥

తా॥ విరోధిజన సంచారము జరిగినదను అనుమాన

ముచే కలతబడిన మనస్సు కలవారై ఆయుధములతోను, పరివారముతోను కూడి అచ్చటకు వచ్చిరి.

శ్లో॥ అథ క్షిప్తఘటే రం ధ్రా న్నిష్క్రమ్యాచ శనై ర్భువి ।
వవృధే వానర శ్రేష్ఠః ప్రావృషీవ ఘనాఘనః ॥

తా॥ పిమ్మట కుండనుండి కపిశ్రేష్ఠుడగు హనుమంతుడు బయటకువచ్చి నెమ్మదిగ భూమిపై జేరి వర్షాకాలపు మేఘమువలె వృద్ధినందసాగెను.

శ్లో॥ వర్ధమానం మహాకాయం దీప్యమానం స తేజసా ।
అభిజగ్ముర్ద్విషతేః పుత్రాః శలభా ఇవ పావకమ్ ॥

తా॥ పెరుగుచున్న గొప్ప దేహముకల్గి తేజస్సుచే ప్రకాశించు హనుమంతుని కడకు ఆ రాక్షసులు అగ్నికడకు మిడుతలు వెడలునట్లు వెడలిరి.

శ్లో॥ స హత్వాஉభిహతో దైత్యైర్మైరావణసమీపగైః
ప్రవృద్ధః క్రోధతామ్రాక్షః శూర్ణయామాస తాన్ కపిః॥

తా॥ మైరావణుని సమీపమందలి రాక్షసులచే కొట్టబడినవాడై హనుమంతుడు వారందరను చంపి మిక్కిలి పెద్దవాడై క్రోధముతో ఎఱ్ఱబడిన కండ్లు కల్గి ఆ రాక్షసులందఱను పిండిచేసెను.

శ్లో॥ తథా కృతేషు సర్వేషు రాక్షసేషు హనూమతా ।
వాయువేగ సహాయుక్తో నిర్యయౌ మత్స్యవల్లభః ॥

తా॥ ఆ రీతిగా హనుమంతుడు రాక్షసు లందఱను చూర్ణము చేయగా వాయువేగముతో అచ్చటకు మత్స్యవల్లభుడు వచ్చెను.

శ్లో॥ యుద్ధాయాకారయామాస తాడయ న్భూరుమండలం।
హనూమంత మ్మహాత్మానం తత్సమో మత్స్యవల్లభః॥

తా॥ హనుమంతునితో సమానుడైన మత్స్యవల్లభుడు నేలగొట్టుచు మహానుభావుడగు హనుమంతుని యుద్ధమునకు పిలచెను.

శ్లో॥ స మారుత ఇవ శ్రీమాన్ సంక్రుద్ధ శ్చోరుఘట్టనాత్ ।
తస్యోరసి శిలాస్పర్శ ముష్టిఘాతై రతాడయత్ ॥

తా॥ తొడగొట్టుటచే కోపమందినవాడై హనుమంతుడు ప్రభంజనునివలె ఆ మత్స్యవల్లభుని వక్షస్థలముపై రాతివంటి పిడికిలితో బాదెను.

శ్లో॥ తత్ప్రహార విదీర్ణోరాః మానయ న్పవనాత్మజం ।
మూర్ధ్ని సంతాడయామాస పాణిభ్యా మ్మత్స్యవల్లభః॥

తా॥ ఆ దెబ్బచే వక్షస్థలము పగులగా హనుమంతుని బలము గ్రహించి మత్స్యవల్లభుడు రెండు చేతులతో హనుమంతుని శిరస్సుపై మోదెను.

శ్లో॥ స తేన తలఘాతేన దంష్ట్రాగ్రరసనః కపిః ।
విముంచాశ్రూణి నేత్రాభ్యాం ముహూర్తం ధ్యాన మాస్థితః॥

తా॥ అట్టి తీవ్రమగు దెబ్బచే నాలుకపండ్లు చివరకు రాగా కంట్ల నెంట నీరు వెడల హనుమంతుడు క్షణకాలము ధ్యానమగ్నుడై నిలచెను.

శ్లో॥ అథ ధైర్యం సమాస్థాయ మారుతి ర్భీమవిక్రమః ।
ధావతి స్మాతివేగేన ముష్ట్యుద్య న్మత్స్యవల్లభం ॥

తా॥ పిమ్మట ధైర్యము తెచ్చుకొని మహా పరాక్రమవంతుడగు హనుమంతుడు మత్స్యవల్లభుని పట్టుకొనుటకై వేగముగా పరుగిడెను.

శ్లో॥ సింహసంహనసోపేతః శఫరీనందన స్తథా ।
గ్రీవాం గ్రహీతుకామోఽస్య వితేనే ప్లుతలాఘవమ్॥

తా॥ సింహముల జంపజాలు మత్స్యవల్లభుడును హనుమంతుని కంఠము పట్టుకొన నెంచి ముందుకురూకెను.

శ్లో॥ యావద్గళం న జగ్రాహ మారుతే ర్మత్స్యనందనః ॥
గృహీత్వా పాదయో స్తావత్ భ్రామయామాస తం కపిః॥

తా॥ మారుతి కంఠము పట్టుకొనునంతలోనే మత్స్యవల్లభుని పాదములను పట్టుకొని హనుమంతుడు గిఱ్ఱున త్రిప్పసాగెను.

శ్లో॥ సోఽపి యుద్ధవిశేషజ్ఞః మాతో స్య మత్సరవిహ్వలః ।
భ్రామ్యమాణో హనూమంతం జలూకావద్గళే గ్రహీత్॥

తా॥ మత్స్యవల్లభుడు కూడ యుద్ధవిశేషము లెఱిగినవాడగుటవలన కోపమునిఅట్లు త్రిప్పబడుచునే ఒక్కమారుగ జలగవలె హనుమంతుని కంఠమును పట్టివైచెను.

శ్లో॥ గృహీత కంఠనాళస్సన్ కపీంద్రో యుద్ధసంభ్రమః ।
బలాద్విమోచయామాస గళే గ్రాహిణ మాత్మజమ్ ॥

తా॥ అట్లు కంఠనాళము మత్స్యవల్లభుని చేజిక్కగా హనుమంతుడు కంఠమును పట్టుకొని తన కుమారుడగు మత్స్యవల్లభుని బలవంతముగ విడిపించెను.

శ్లో॥ వ్యర్థీకృతోద్యమో మాత్స్యః క్రోధ తామ్ర విలోచనః।
జఘా నోరసి ముష్టిభ్యాం ఘనాభ్యా మివ మారుతేః॥

తా॥ తన యత్నమంతయు వ్యర్థమగుటవలన మిక్కిలి కోపముచే కండ్లెఱ్ఱగాఁగా మత్స్యవల్లభుడు గొప్పవగు పిడికిళ్ళతో ఆ జనేయుని వక్షస్థలముపై కొట్టెను.

శ్లో॥ హనుమా నపి పార్ష్ణిభ్యాం ఘాతయామాస శాఫరిం
ఏవం సమబలౌ యుద్ధం చక్రతు ర్భిమవిక్రమౌ
మాత్స్య శాఖామృగౌ ఘోరం అవ్యవస్థ జయాజయౌ॥

తా॥ హనుమంతుడును కాలిమడములతో మత్స్యవల్లభుని బాదెను. ఇట్లు భయంకరమగు పరాక్రమము కల్గి సమమైన బలముకల హనుమంతుడు మత్స్యవల్లభుడును జయాపజయము లెవ్వరికి కల్గునో తెలియరాకుండ ఘోరమగు యుద్ధము చేసిరి

శ్లో॥ అథాన్తరే మహాప్రాజ్ఞో హనుమా న్నీతినైపుణ్యః।
చిన్తయామాస ధర్మాత్మా కోన్వయం యుద్ధదుర్మదః॥

తా॥ ఇంతలో మహాపండితుడు, నీతి విశారదుడు, ధర్మాత్ముడు అయిన హనుమంతుడు ఇట్టి యద్ధగర్వము కలవా డెవ్వడాయని ఆలోచింప జొచ్చెను.

శ్లో॥ మదీయ ముష్టిఘాతేన పార్ష్ణిఘాతద్వయేన చ
ప్రాణా న్ధత్తే పుమా న్వీరో యుద్ధా యాహ్వాయతే పునః

తా॥ నా పిడికిటి దెబ్బ, మడమలు రెంటి దెబ్బలుతిని

కూడ ఈ వీపుడింకను బ్రతికియున్నాడు. పైగా యుద్ధము నకు పిలుచుచున్నాడు.

శ్లో॥ అథాబ్రవీ ద్వాయుపుత్రః గర్వితం మత్స్యవల్లభం
కో భవా న్పురుషశ్రేష్ఠ మత్సమాన పరాక్రమః॥

తా॥ ఆసుకొని పిదప గర్వించియున్న మత్స్యవల్లభు నితో హనుమంతు డిట్లనెను. ఓ పురుషశ్రేష్ఠుడా ? నాతో సమానమైన పరాక్రమముగల నీ వెవ్వడవు ?

శ్లో॥ మూర్ధ్ని సంతాడితోఽపి త్వం పార్ష్ణిభ్యాం పృష్ఠభాగతః
ప్రాణా న్సంధారయసి క స్త్వం బ్రూహి యథార్థతః॥

తా॥ నెత్తిపై మోదినను, మడమలతో వెన్నున తాచి నను బ్రతికియున్నావు. యథార్థముగ నీ వెవ్వడవో తెల్పుము.

శ్లో॥ శ్రుత్వా తు వచనం న్యాయ్యం మారుతే ర్మత్స్యవల్లభః।
స న్యవేదయ దాత్మానం పుత్రం హనుమతః ప్రభోః॥

తా॥ న్యాయపూర్ణమైన మారుతి వాక్యము విని మత్స్యవల్లభుడు తాను మహానుభావుడైన హనుమంతుని కుమారుడనని తెల్పుకొనెను.

శ్లో॥ పునః ప్రాహ కపిశ్రేష్ఠః విస్మయావిష్టమానసః।
కో వా హనూమాన్ మతిమన్ త్వం వా తస్య కథం సుతః॥

తా॥ అంత ఆశ్చర్యచకితుడై ఆంజనేయుడు మరల ఇట్లడిగెను. ఓ బుద్ధిశాలీ ! హనుమంతుడెవడు ? నీ వాతని కెట్లు పుత్రుడవైతివి ?

శ్లో॥ కా వా తే జననీ లోకే కుత్ర వాసః పరంతప।
ఇతి సంచోదిత స్తేన వినయావనత స్సుతః॥

తా॥ నీతల్లి ఎవరు ! శత్రునాశకుడా! నీ నివాసమేది? అని ఆంజనేయుని చేత అడుగబడి వినయవినమ్రుడై మత్స్య వల్లభుడు

శ్లో॥ ఆత్మవృత్తం పరం తస్మై వక్తుం సముపచక్రమే।
పురా దాశరథీ రామో రఘువంశ సముద్భవః
అప్రమేయగుణ శ్రీమాన్ సర్వభూతదయాపరః ॥

తా॥ తన వృత్తాంతమునిట్లు హనుమంతునకు చెప్ప టకు ప్రక్రమించెను. పూర్వము రఘువంశమందు జనించినట్టి, ఉత్తమగుణములు కల్గినట్టి, శ్రీమంతుడు, సర్వప్రాణులయెడ దయ కల్గినట్టి దశరథనందనుడైన శ్రీరాముడు

శ్లో॥ పితుస్సత్యప్రతిజ్ఞస్య ప్రతిజ్ఞా మనుపాలయన్
సీతాయా ధర్మపత్న్యా చ లక్ష్మణే నానుజేనచ।
వివేశ దండకారణ్యం తాపసాశ్రయ ముత్తమమ్॥

తా॥ సత్యప్రతిజ్ఞకల తండ్రియొక్క ప్రతిజ్ఞను పాలిం చుచు ధర్మపత్నియగు సీతతోను, తమ్ముడగు లక్ష్మణుని తోను వచ్చి తాపసులకు నిలయమై ఉత్తమమైన దండకా రణ్యమును ప్రవేశించెను

శ్లో॥ తస్య భార్యాం మహాభాగాం సర్వలక్షణలక్షితాం
త్రిలోక సుందరీం సీతాం శ్రుత్వా దృష్ట్వా చ మైథిలీం
రాఘవో వంచయిత్వా హి రావణో హృతవాన్ శఠః॥

తా॥ ఆ రాముని భార్యయు, మహాభాగయు, సర్వ

శుభలక్షణములతో కూడినదియు, ముల్లోకములందును సుంద
రియగు సీతనుగూర్చి విని, ఆమెనుచూచి దురాత్ముడగు
రావణుడు రామలక్ష్మణులను మోసముచేసి ఆమెను
గొంపోయెను.

శ్లో॥ తతో రామ స్సుదుఃఖార్తో మార్గమాణో వనే ప్రియాం
సుగ్రీవేణ సమాయుక్త స్తేన సఖ్యం చకార సః॥

తా॥ పిమ్మట దుఃఖముచే ఆర్తుడగు రాముడు అడవి
యందు తన ప్రియురాలిని వెదకుచు సుగ్రీవుని కూడి ఆత
నితో స్నేహము చేసెను.

శ్లో॥ తం ప్రతిజ్ఞాప్య రాజానం సుగ్రీవం ప్రాణసన్నిభం ॥
ఉపలభ్య చ సీతాయా వృత్తాన్తం వాయునందనాత్ ॥

తా॥ ప్రాణ సమానుడగు మిత్రుని సుగ్రీవుని రాజుగా
నొనరించి ఆంజనేయుని వలన సీతాదేవి వృత్తాంతమును
తెలిసికొని—

శ్లో॥ తతశ్చ రావణపురీం లంకా మబ్ధి పరీవృతాం ।
దదర్శ సపరీవారం మధ్యే కల్లోలమాలినః ॥

తా॥ పిమ్మట సముద్రముచే చుట్టబడి, అలలమధ్యలో
నున్న రావణపురమగు లంకను రాముడు తన పరివారముతో
కూడి చూచెను.

శ్లో॥ సముద్రం బద్ధయామాస గమన ప్రతిబన్ధకం ।
కపయః పర్వతాకారాః నానావిధ విచేష్టితాః ॥

తా॥ వెళ్ళుటకు అడ్డముగానున్న సముద్రమునకు

రాముడు వారధిగట్టెను. నానావిధ చేష్టలు కల పర్వతాకారులగు వానరులు-

శ్లో॥ ఇతస్తతో మహాశైలా నానీయ దృఢవిక్రమాః ।
సముద్రే పాతయాంచక్రుః స్థలీకర్తుం మహాబలాః ॥

తా॥ దృఢ విక్రములు, మహాబలులు అగుటవలన అటనటనున్న కొండ బండలను తెచ్చి బాట యేర్పడుటకై సముద్రమున పడవైచిరి

శ్లో॥ అస్తి కశ్చిన్మహాశూరో కపిర్మతి మతాం వరః
హనూమన్నామ దుర్ధర్షః పార్వతీ ప్రియనందనః॥

తా॥ వారిలో మహా పరాక్రమవంతుడగు వానరుడు కలడు. ఆతడు బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు, పార్వతీతనయుడు హనుమంతుడను పేరుగల అజేయుడు.

శ్లో॥ సుగ్రీవాంగద మైందాది సచివో భీమ విక్రమః
ఆనీతా బహవ శ్శైలాః తేన బద్ధుం సరిత్పతిమ్॥

తా॥ ఆతడు సుగ్రీవ, అంగద, మైందాది సహాయులు కలిగిన భయంకర పరాక్రమము కలవాడు. సముద్రమును బంధించుటకై ఆ హనుమంతునిచే అనేక పర్వతములు తేబడినవి.

శ్లో॥ తదా తస్యా భవ త్స్వేదః పరిశ్రమ సముద్భవః
లలాటపట్టకాయాం నై ముక్తాఫల ఇవా బభౌ ॥

తా॥ అప్పుడు ఆతనికి అట్టి పరిశమ కారణముగా చెమటపట్టెను. అది నుమట ఖంత్యములవలె ప్రకాశించెను.

శ్లో॥ తజ్జలం పాణినాకృష్య చిక్షేప ప్ధిజలే కపిః
సముద్రాంతస్ప్నితా కాచి ద్దీర్ఘ దేహీ చ నామతః॥

తా॥ ఆంజనేయుడు ఆ స్వేదజలమును చేతితో తీసి సముద్రజలమున విడిచెను. సముద్రమునందు దీర్ఘదేహి అనుపేరుగల ఒకానొక

శ్లో॥ మత్స్యాంగనా మహాసత్త్వా క్షుధయా క్షుభ్దమానసా
తత్స్వేదజల మత్యుగ్రం పీత్వా చ సుఖితా భవేత్॥

తా॥ మత్స్యాంగన కలదు అది గొప్ప బలముకలది. ఆకలిచేత బాధపడుచున్నది. ఆ మత్స్యాంగన ఆంజనేయుని స్వేదజలమును త్రాగి సుఖమందెను.

శ్లో॥ సా సుతం జనయామాస హనూమత్సమ విక్రమః
మత్స్యవల్లభ నామానం ఇంద్రాద్యై రపి దుర్జయమ్॥

తా॥ ఆమె హనుమంతునితో సమానమైన పరాక్రమముకల్గి, ఇంద్రాదులకును జయింప శక్యముకాని మత్స్యవల్లభుడను పేరుగల కుమారుని కనెను.

శ్లో॥ సోఽహం హనూమతఃపుత్రో దీర్ఘదేహీ ప్రసూర్మమ।
గంధర్వవనితా పూర్వం మమ మాతా పతివ్రతా॥

తా॥ ఆ హనుమంతుని కుమారుడను నేనే. దీర్ఘ

దేహంకి పుట్టినవాడను. పతివ్రతయగు నాతల్లి పూర్వము గంధర్వ వనిత.

శ్లో॥ మతంగముని శాపేన మత్స్యయోనిం జగామ సా।
దత్తాశాపావధి స్తేన ప్రసన్నేన మహర్షిణా॥

తా॥ ఆమె మతంగ మహాముని శాపముచే మత్స్య జన్మ నొందినది. ప్రసన్నుడైన ఆ మహాముని ఇట్లు శాపావధి కూడ అనుగ్రహించెను.

శ్లో॥ స్వేదోదకం కపీంద్రస్య త్వన్ముఖే నిపతిష్యతి।
తదా గర్భో భవే దాశు భవితా చ సుతోదయః॥

తా॥ వానర శ్రేష్ఠుడగు హనుమంతుని చమటబిందువులు నీ నోట బడగలవు. వెంటనే నీవు గర్భవతివగుదువు. పుత్రోదయము నగును.

శ్లో॥ మత్స్యవల్లభ నామాంకః హనూమత్సమ విక్రమః।
గమిష్యసి తదా భూయః గాంధర్వవపు రేవ తత్॥

తా॥ ఆ పుత్రుడు హనుమంతునితో సమానమైన పరాక్రమము కలవాడు, మత్స్యవల్లభుడను పేరుకలవాడును అగును. పిమ్మట నీవు మరల గంధర్వ శరీరమునందెదవు.

శ్లో॥ జాతి స్మృతి శ్చ తే భూయా న్మత్స్యజన్మ న్యపి స్ఫుటం
భూతభావీ భవ త్యస్తు జ్ఞాన మస్తు శుభాంగి తే॥

తా॥ ఓ శోభనాంగి! మత్స్యజన్మయందుకూడ నీకు

స్పష్టముగ పూర్వజాతి జ్ఞప్తియుండును. నీకు భూత భవి ష్యద్వర్తమానముల మూడుకాలముల జ్ఞానము ఉండును.

శ్లో॥ ఇత్యేవం మునినా దిష్టా సద్యో మత్స్యశరీరిణీ।
సతాం మాజా హి దుర్లంఘ్యా దేవ దానవ మానుషైః॥

తా॥ అని ఇట్లు మతంగమునిచే ఆదేశింపబడి వెంటనే మత్స్యశరీరమును దాల్చినది. దేవతలకు, రాక్షసులకు, మనుష్యులకును మహాత్ముల ఆజ్ఞలు మీఱరానివికదా!

శ్లో॥ ఇత్యేవ ముపదిష్టమ్మే మమ మాత్రా పురా విదా।
తదాప్రభృత్యహం ప్రాజ్ఞ మాతు ర్వచన గౌరవాత్॥

తా॥ అని పూర్వజ్ఞానముకల నా తల్లిచే నాకు చెప్పబడినది. ఓ మహాజ్ఞానీ! అప్పటినుండి నేను నా తల్లి మాటయందలి గౌరవమున

శ్లో॥ వసా మ్యస్మి న్పురే రమ్యే మైరావణవశానుగః।
పాలయ న్న్విదదం ద్వారం భుంజే భోగా న్యథేప్సితాన్॥

తా॥ ఈ రమ్యమగు పట్టణమున మైరావణుని అనుచరునిగా నివశించుచున్నాను. ఈ ద్వారమును రక్షించు వాడనై వలయు సుఖములను అనుభవించుచు జీవించుచున్నాను.

శ్లో॥ ఇదానీం త్వా మహం పశ్యన్ ప్రవిష్టం ద్వారసన్నిధిం।
సంప్రాప్తః ప్రాప్తరోషస్సన్ హన్తుకామో నిశాచరాన్॥

తా॥ ఇప్పుడు ద్వారసన్నిధిని ప్రవేశించిన నిన్ను

చూచి నేను కోపమందిన వాడనైతిని. రాక్షసులను సంహ
రించిన నిన్ను చంప నెంచుచున్నాను.

శ్లో॥ ఏవం నివేదితం సర్వం పృచ్ఛకాయ హితాయ తే॥

తా॥ ఇట్లు హితునివలె అడిగిన నీకు నా చరిత్ర
యంతయు తెలుపబడినది.



శ్లో॥ ఇత్యుక్తవచనం మత్స్యవల్లభం కపివల్లభః।
కృపా ప్రేమార్ద్రచిత్తస్సన్ ప్రత్యువాచ వచో హితమ్॥

తా॥ అని చెప్పిన మత్స్యవల్లభునితో వానరశ్రేష్ఠు
డగు హనుమంతుడు దయతోను, ప్రేమతోను నిండిన మనస్సు
కలవాడై మేలగు రీతి నిట్లు బదులుపల్కెను.

శ్లో॥ అహమేవ హనూమాన్ వై హితో తవ సువిక్రమ!।
రామకార్యవశా న్నూనం ఆగత స్తవసన్నిధిమ్॥

తా॥ ఓ పరాక్రమవంతుడా! నీకు హితుడనగు హను
మంతుడను నేనే. రామకార్యార్థమై నీ కడకు వచ్చితిని.

శ్లో॥ రామో దాశరథి స్తీర్త్వా సేతుం చ సరితాంపతిం।
లంకాం నిరోధయాంచక్రుః కపిభిః పర్వతోపమైః॥

తా॥ దశరథనందనుడగు శ్రీరాముడు సేతువు
నిర్మించి సముద్రమును దాటి పర్వత సమానులగు వాన
రులతో లంక నెదుర్కొనెను.



శ్లో॥ తతో మైరావణః ప్రాప్తో రావణేనాభిచోదితః।
వంచయిత్వా కపీన్ సర్వాన్ గృహీత్వా రాఘవావపి
జగామ స్వపురీం శీఘ్రం తేనాహం సముపాగతః॥

తా॥ పిమ్మట రావణునిచే ప్రేరేపింపబడినవాడై, మైరావణుడు వచ్చి సర్వవానరులను మోసగించి రామ లక్ష్మణులను తీసికొని తన పట్టణమునకు వచ్చెను. అందుచే నేను ఇచ్చటకు వచ్చితిని.

శ్లో॥ ఇత్యుక్త్వ వచనం తాతం కపీంద్రం మత్స్యవల్లభః।
స్తుత్వా స్తుతిభి రర్థ్యాభిః సాష్టాంగం ప్రణతో భవత్॥

తా॥ అని చెప్పుచున్న తండ్రియగు వానరేశ్వరుని మత్స్యవల్లభుడు కొనియాడదగు స్తోత్రములతో స్తుతించి సాష్టాంగ నమస్కారము లాచరించెను.

శ్లో॥ ఉత్థాప్య కపినాథస్తు సమాఘ్రాయ చ మూర్ధని।
ఆలిలింగే సుతం శ్రీమాన్ పరమానంద నిర్భరః॥

తా॥ శ్రీ హనుమంతుడు మత్స్యవల్లభుని లేవనెత్తి ఆతని శిరస్సు ముద్దాడి పరమానందభరితుడై కుమారుని కౌగలించుకొనెను.

శ్లో॥ తతో ఽబ్రవీత్కపిశ్రేష్ఠః ప్రశ్రయావనతం సుతం।
భవాన్ మమాత్మజో నూనం సమపౌరుష విక్రమః॥

తా॥ పిమ్మట నమ్రుడైన కుమారునితో సానునయముగా వానరశ్రేష్ఠుడగు హనుమంతుడిట్లనెను. నాతో సమానమైన పరాక్రమము కల నీవు నిశ్చయముగా నా కుమారుడవే.

శ్లో॥ దేవ దానవ గంధర్వా పతగోరగ కిన్నరాః।
న స్థాతుం మేఽగ్రత శ్శక్తాః కిం పున ర్యుద్ధకర్మణి॥

తా॥ దేవతలు, రాక్షసులు, గంధర్వులు, పక్షీంద్రులు, నాగవంశజులు, కిన్నరులు నా ఎదుట నిలచుటకే సమర్థులు కారు. ఇక యుద్ధమున చెప్పవలసిన దేమి ?

శ్లో॥ బిభేమ్యతిప్రశంసాయాః మమధర్మేణ సంశపే।
జగత్త్రయేఽపి కశ్చిన్మే ప్రతియోద్ధా న విద్యతే॥

తా॥ మిక్కిలియగు పొగడ్తలకు వెఱతును. నా ధర్మముగా చెప్పుచున్నాను. ముల్లోకములందును నన్నెదిరించు యోధుడొక్కడును లేడు.

శ్లో॥ తతో మత్పుత్రభావేన యుధి స్థిత్వా మమాగ్రతః।
వజ్రాశనిసమప్రఖ్యాః ముష్టిఘాతా స్తృణీకృతాః॥

తా॥ కాగా నా కుమారుడవగుటవలన నీవు నా ఎదుట యుద్ధమున నిలచితివి. వజ్రాయుధముతోను, పిడుగుతోను సమానములయిన నా పిడికిటి దెబ్బలను తృణీకరింప కల్గితివి.

శ్లో॥ అతశ్చిరం సుఖం భుంక్ష్వ దీర్ఘమాయు ర్నవంవయః
లభ స్వాష్టసుతా న్సౌమ్యాన్ భద్రా న్భద్రగుణాన్వితాన్

తా॥ కావున దీర్ఘాయువును, యౌవనమును పొంది చిరకాలము సుఖములనుభవించుము. సౌమ్యులు, మంచివారు, సద్గుణవంతులు అగు ఎనిమిదిమంది పుత్రులను పొందుము

శ్లో॥ అద్యప్రభృతి తే పుత్ర మాభూ త్క్వాపి పరాజయః।
స్వస్తి తేఽస్తు గమిష్యామి కార్యం హ్యస్తి మమాగ్రతః॥

తా॥ ఓ కుమారా ! నేటినుండి నీకు ఎచ్చటను పరాజయమనునది కలగదు. నీకు శుభమగుగాక ! నాకు ముఖ్యమగుపనియున్నది. నేను వెళ్ళుచున్నాను.

శ్లో॥ ఇత్యుక్తవంతం వచనం కపీశ్వరం
ప్రవేశయిత్వా పురమధ్య గహ్వరం
తదా సుత స్యాఽను జగామ మందిరం
శతం పదానాం స్ఫుట సౌహృదక్రమః॥

తా॥ అని పల్కు హనుమంతుని మత్స్యవల్లభుడు పాతాళలంకాపుర మధ్యప్రదేశమును జేర్చి స్పష్టమైన ప్రేమభావమున కుమారుడగు మత్స్యవల్లభుడును మందరమునకు పోజొచ్చెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం
హనుమద్వివరణే హనుమత్పాతాళ
లంకాప్రవేశ కథనం నామ
షట్ చత్వారింశత్పటలః

# సప్త చత్వారింశ త్పటలః

## వైరావణవధోపాఖ్యానం

శ్లో॥ యే గుణాః వర్ణితాః పూర్వం మన్మాత్రా తదభిజ్ఞయా ।
తే సర్వే తత్ర సందిష్టాః హనూమతి తతో ఽధికాః॥

తా॥ పూర్వము దీర్ఘదేహి యను పేరుగల నా తల్లిచే ఏగుణములు వర్ణితములైనవో అవి యన్నియు అంతకు మించియు గుణములు హనుమంతునియందున్నవి.

శ్లో॥ ఇతి వాదికపేః పుత్రో విస్మయావిష్ట చేతనః

తా॥ అని మిక్కిలి ఆశ్చర్యమునందిన వానరసుతుడగు మత్స్యవల్లభుడనెను.

శ్లో॥ రాజ్ఞా మాజ్ఞా హి దుర్లంఘ్యా ప్రభూణాం నీతి రీదృశ।
ఇతి తంసాంత్వయన్ పుత్రం పరమానందనిర్భరం
అనుయాత్రాం నిరాచక్రే భావికార్య మనుస్మరన్॥

తా॥ రాజాజ్ఞ తిరస్కరింపరానిది. ప్రభునీతి ఇట్టిది అని పరమానంద పూర్ణుడగు పుత్రునితో ఆదరముగా పల్కి హనుమంతుడు జరుగవలసినపని నాలోచించుకొనుచు తన వెంట పుత్రుడువచ్చుటను నిరాకరించెను

శ్లో॥ నిషిద్ధగమనః పుత్రః సీతిబోధనపూర్వకం
పుని ర్నివృత్త విక్రాన్తః ధ్యాయన్ త త్పాదపంకజం॥

తా॥ సీతివాక్యములతో నివారింపబడిన గమనము కల మత్స్యవల్లభుడు పౌరుషమును మరలించుకొని హనుమంతుని పాదపద్మములనే స్మరించుచు

శ్లో॥ పున రాగమనాకాంక్షీ మారుతే ర్మత్స్యవల్లభః
యథా స్వదేశం సంప్రాప్తః తూష్ణీ మాసీత మూకవత్॥

తా॥ ఆంజనేయుడు మరల రావలెనని కోరుకొనుచు మత్స్యవల్లభుడు స్వస్థలమును చేరి మిన్నకుండెను.

శ్లో॥ హనూమా నపి ధర్మాత్మా రామకార్య త్వరాన్వితః।
దదర్శాంతఃపురే రమ్యే మైరావణ మతంద్రితం॥

తా॥ ధర్మాత్ముడు, రామకార్యమునందు తొందరకల వాడు అగు హనుమంతుడు రమ్యమగు అంతఃపురమున నిలకడగనున్న మైరావణుని చూచెను.

శ్లో॥ పర్వత ప్రతి మాకారం కాలాగ్ని మివ తేజసా
భయంకరం చ సత్త్వానాం నిశ్వ సన్త మివోరగమ్॥

తా॥ ఆ మైరావణుడు పర్వతముతో సమానమైన ఆకారముకలవాడు తేజస్సుచేత ప్రళయకాలాగ్నివలె నున్న వాడు, ప్రాణికోటికి భయమును కల్గించువాడు, బుసలుకొట్టు సర్పమువలె నున్నవాడును.

శ్లో॥ తతః క్రోధవశాపన్నః సహసా వాయునందనః
తం మూర్ధ్ని తాడయామాస దృఢబద్ధేన ముష్టినా॥

తా॥ అట్టి మైరావణుని చూచినంత మిక్కిలికోపము కలవాడై హనుమంతుడు వెంటనే గట్టిగాబిగించిన పిడికిలితో మైరావణుని నెత్తిపై బాదెను.

శ్లో॥ తేన ముష్టిప్రహారేణ స దైత్యః పాపకర్మకృత్
అమూర్ఛన్ముహు ర్మౌలిం పూర్వాజ్ఞాతేదృశ వ్యథః॥

తా॥ ఆ పిడికిటపోటుతో పాపకర్మము లాచరించెడి మైరావణుడు మునువెన్నడు ఇట్టి బాధననుభవించని వాడగుటవలన తలతిరిగినవాడయ్యెను.

శ్లో॥ దైత్యేంద్రో ఒపి మహామాయః క్రోధ సంరక్తలోచనః
జజ్వాల ముష్టిఘా తేన సర్పిషేవ హుతాశనః॥

తా॥ మహామాయావియగు ఆ రాక్షసుడును కోపముతో ఎఱ్ఱబడిన కండ్లుకలవాడై నేతిచే అగ్ని మండినట్లు హనుమంతుని ముష్టిఘాతముచే మండిపడెను.

శ్లో॥ వవృధే వానరశ్రేష్ఠ వాయుపుత్రజిఘాంసయా
స్పృష్ట భూతల పాదాగః దృష్ట మేఘ శిరోరుహః॥

తా॥ అంత మైరావణుడు మారుతినిచంప నిచ్ఛకలవాడై దేహమును పెంచి భూతలముతో స్పృష్టమైన పాదాగ్రము కలవాడై. మేఘములే జట్టుగా కనపడువాడై

శ్లో॥ జుష్టాచల దరీ నాసా స్పష్ట చక్ర కనీనికః

తా॥ పర్వత గుహవంటి ముక్కు కల్గి, చక్రమువంటి కంటిపాపలు కల్గియుండెను.

శ్లో॥ ఏవంవిధో మహాకాయః కోఽయ మిత్యనుచిన్తయన్
ధావతి స్మాతివేగేన యత్రాస్తే వాయునందనః॥

తా॥ ఇంతపెద్ద దేహము కలవాడెవ్వడా అనుకొనుచు హనుమంతుడు వేగముగ పరుగిడజొచ్చెను.

శ్లో॥ తదా తద్గతివేగేన పాదపాః పార్శ్వవర్తినః
కేచి దున్మూలితా స్సర్వే భగ్నశాఖా స్తథాపరే॥

తా॥ అప్పుడు ఆతని పరుగుతో సమీపమున నున్న చెట్లుకొన్ని పడిపోజొచ్చెనవి. కొన్ని కొమ్మలు విరిగినవైనవి

శ్లో॥ శిథిలీకృత పాషాణ సంధిబంధా శ్శిలోచ్చయాః
తదాగమ సమీరేణ చాలితా అచలా అపి॥

తా॥ పర్వతములు సంధిబంధములు పోయిన పాషాణములు కల్గినవైనవి. ఆతని పోకడవలన గాలికి పర్వతములు సైతము చలించినవి.

శ్లో॥ మైరావణః పదన్యాసైః చకమ్పే చ వసుంధరా
అభిగమ్య తథా దైత్యః విస్మితం కపిపుంగవమ్॥

తా॥ మైరావణుడు అడుగులిడగా భూమి కంపించెను. ఆ రీతిగా నున్న మైరావణుడు ఆతనిని చూచి ఆశ్చర్యపడు హనుమంతునికడకు వచ్చి

శ్లో॥ తలాభ్యాం కరయో రాసు ఘాతయామాస మూర్ధని
రక్షఃప్రవృద్ధ కాయస్య దర్శనా ద్విస్మితః కపేః ॥

తా॥ బాగుగా వృద్ధిపొందిన రాక్షసుని దేహమును చూచుటచే ఆశ్చర్య చకితుడై యున్న ఆంజనేయుని శిరస్సుపై మైరావణుడు అరచేతితో కొట్టెను.

శ్లో॥ మై ' వ ॰ కరాఘాతం తుషాఘాత మమన్యత

తా॥ అట్టి మైరావణుని చేతి దెబ్బను హనుమంతుడు ఊక దెబ్బగా తలచెను.

శ్లో॥ భూయ స్తృణీకృతా ఘాతం వ్యాసక్త మనసః కపిం
కపోలే ఫాలదేశే చ తాడయామాస దానవః ॥

తా॥ దాని నెఱిగినవాడై మైరావణ రాక్షసుడు గడ్డిపోచవలె తన దెబ్బలను లెక్కలేకుండ తీసివేసిన మారుతిని చెక్కిలి పైనను, నుదుటిపైనను బాదెను.

శ్లో॥ తతో నివృత్త వ్యాసంగః ప్రబుద్ధ ఇవ మారుతిః
దృఢా భ్యాం ముష్టిఘాతా భ్యాం వక్షో వివ్యాధ రక్షసః॥

తా॥ వెంటనే ఆలోచనమాని మేల్కొలుప బడినవానివలె హనుమంతుడు ఆ రాక్షసునియొక్క వక్షస్థలమునకు దృఢమైన పిడికిలి దెబ్బలతో బాధ కలిగించెను.

శ్లో॥ తేన ముష్టిప్రహారేణ విదీర్ణ హృదయోఽసురః
పపాత సహసా భూమౌ ఛిన్నమూల ఇవ ద్రుమః॥

తా॥ ఆ పిడికిటి దెబ్బతో ఱొమ్ము చీలిపోగా ఆ రాక్షసుడు వెంటనే మొదలునరికిన చెట్టువలె భూమిపై బడెను.

శ్లో॥ పతితం రాక్షసం దృష్ట్వా సర్వభూత దయాపరః
న ప్రహారమనా స్తూర్ణం మారుతి ర్నీతికోవిదః॥
తా॥ అట్లు పడిపోయిన రాక్షసుని సర్వప్రాణుల యందు దయవహించు హనుమంతుడు చూచి నీతి కోవిదు డగుటవలన పడినవానిని మరలకొట్టుటకు యత్నించ లేదు.

శ్లో॥ అథాన్వేష్టుం నృపసుతే రాఘవౌ వరవర్ణినౌ
చక్షు ర్వ్యాపారయామాస సర్వతో ఽన్తఃపురే కపిః॥
తా॥ తరువాత మహానుభావులగు రామలక్ష్మణులను వెదుకదలచినవాడై ఆంజనేయుడు అతఃపురమందంతటను చూచెను.

శ్లో॥ అథాన్తరే మహామాయో నిజమాయా మనుస్మరన్
మైరావణ స్సముత్థాయ దుద్రావ కపినాయకమ్॥
తా॥ ఇంతలోనే మహామాయావి యగు మైరావణుడు తన మాయవలన లేచి హనుమంతునికడకు పరుగిడెను.

శ్లో॥ ఆయాన్త మసురం దృష్ట్వా మారుతి ర్భీమవిక్రమః
గృహీత్వా పాదయో రాశు భ్రామయిత్వా వ్యతాడయత్
తా॥ వచ్చుచున్న రాక్షసుని మైరావణుని చూచి భయంకరమగు పరాక్రమముకల హనుమంతుడు వెంటనే ఆతని కాళ్ళు పట్టుకొని గిఱ్ఱున త్రిప్పి నేలకు కొట్టెను.

శ్లో॥ తేన సమ్మూర్ఛితో దైత్యః క్షణా దుద్బుద్ధచేతనః
ప్రపాతం పాతయాంచక్రే కపీశ స్యోపరివృతమ్॥
తా॥ అందుచే మూర్ఛనందిన రాక్షసుడు మరుక్షణములో తెలివిపొంది హనుమంతుని పై భాగముననున్న కొండచరియపైకి ఆతని నొక్కమారు విసరెను.

శ్లో॥ ఆయాన్తం పర్వతాకారం పర్వతస్సదృశం కపిం
నఖాగ్రేణైవ చిక్షేప ప్రహరన్ ముఖపంకజం॥

తా॥ పర్వతమంతయుండి పర్వతమువలె ఆకారము కల్గి ఎదురు వచ్చుచున్న హనుమంతుని ముఖమున కొట్టుచు గోనగోటితో ఆతడు విసరెను.

శ్లో॥ క్రోధేన మహతావిష్టో నిర్దహన్నివ మేదినీం
దంశతిస్మ మహాదన్తైః హనూమన్తం దితేస్సుతః॥

తా॥ మైరావణుడు మిక్కిలి కోప మందినవాడై భూమినంతటిని దహించునట్లుండి హనుమంతుని తన పెద్ద దంతములతో కొరుకబోయెను,

శ్లో॥ తథావిధం తు తం వీక్ష్య ప్రహానన్నివ మారుతిః
గండయో స్తాడయాంచక్రే సాపరాధం గురు ర్యథా॥

తా॥ అట్టి స్థితిలోనున్న మైరావణుని హింసించువానివలె హనుమంతుడు తప్పుచేసినవానిని గురువు చెంపదెబ్బవేసినట్లు చెక్కిలిపై బాదెను.

శ్లో॥ కపోలతాడనే నాస్య భగ్నా దశనపఙ్క్తయః
శాద్రఘాతేన శైలస్య దృషదాం సంధయో యథా॥

తా॥ ఆ చెంపదెబ్బతో మైరావణుని దంతముల వరుస తీవ్రమగు దెబ్బవలన పర్వత శిలల సంధులు ఊడిపోయినట్లు ఊడిపోయెను.

శ్లో॥ తతో నిర్వణ్ణవదనో దైత్య స్తదవమానతః
నఖై శ్చిచ్ఛేద సామర్షో యథాజలరోక విదంష్ట్రికః॥

తా॥ పిదప ఆ అవమానముతో రాక్షసుడు వెలవెల బోయినవాడై మిక్కిలికోపమంది కోరలూడగొట్టిన పిచ్చి కుక్కవలె గోళ్ళతో హనుమంతుని రక్కెను.

శ్లో॥ త న్నఖక్షత విద్ధాంగః స్రవ ద్రుధిర రంజితః ।
ఆమూల చూడపుష్పాఢ్య స్స బభౌ కింశుకో యథా ॥

తా॥ ఆతని గోళ్ళతో చీరిన అవయవములు కలవాడై రక్తము కారుచుండుటచే ఎఱ్ఱగా నుండి, మొదలు నుండి అంతటా పూచిన మోదుగ చెట్టువలె నుండెను.

శ్లో॥ విదారయన్తం నఖరైః కరాగ్రై ర్దితినందనం ।
నఖై ర్విపాటయిత్వా తం దూరా చ్చిక్షేప మారుతిః ॥

తా॥ గోళ్ళతో యుద్ధముచేయుచున్న ఆ మైరావణుని తన గోళ్ళతో బ్రద్దలుచేసి హనుమంతుడు దూరముగ విసరెను.

శ్లో॥ సంధాయ పునరేవాశు భిన్నం నిజ కళేబరం ।
దుద్రావ దానవః క్రుద్ధః శిరసాఽభ్యహన త్కపిమ్ ॥

తా॥ చీలిపోయిన తన కళేబరాన్ని మాయావియగు మైరావణుడు మరల సంధించి మిక్కిలి కోపమందినవాడై హనుమంతుని తలతో బాదెను.

శ్లో॥ స తదా ఘోర కర్మాణం రాక్షసం కపినాయకః ।
వాలే నావేష్ట్య దీర్ఘేణ చూర్ణయామాస పర్వతే ॥

తా॥ అప్పుడా భయంకరమైన చేష్టలుకల రాక్షసుని

పై రావణుని హనుమంతుడు తన పొడవయిన తోకతో చుట్టి పర్వతమునందు చూర్ణమగునట్లు కొట్టెను.

శ్లో॥ తథాపి న మృతో దైత్యో మహామాయో౾తిదారుణ
యుద్ధాయోత్థాయ సహసా పునరేవాగ్రత స్థితః॥

తా॥ అయినను మిక్కిలి దారుణమయిన తత్వం కల వాడు, మాయామయుడు అయిన ఆ రాక్షసుడు చావలేదు. మరల వెంటనే లేచి యుద్ధము చేయుటకై హనుమంతుని ఎదుట నిలచెను.

శ్లో॥ గతాగత మహాప్రాణం త్యక్త్వా త్యక్తకళేబరం
హతాహత నిజప్రాజ్ఞం దృష్ట్వా కపికులాగ్రణిః॥

తా॥ పోతూ వస్తూ ఉన్న ప్రాణం కలిగిన విడచి, విడువని కళేబరం కల, పోయి, వచ్చుచున్న తెలివికల ఆ రాక్షసుని వానర శ్రేష్ఠుడగు హనుమంతుడు చూచి

శ్లో॥ విస్మయం పరమం లేభే పద్భ్యామే వాహనత్ పునః।
ఏవం ప్రజఘ్రహ హనుమాన్ ఏకవింశతిసంఖ్యయా

తా॥ మిక్కిలి ఆశ్చర్యముపొందెను. మరల హనుమంతుడు పాదములతో కొట్టెను ఇట్లు ఇరువదియొక్క పర్యాయములు హింసించెను.

శ్లో॥ తథాపి నమృతో మాయో బహిః రుద్ఘాటి తాన్త్రికః

తా॥ ప్రేగులు బయటకు పెకలించినను మాయావి యగు నాతడు చావలేదు.

శ్లో॥ ఏవం మైరావణే నాస్య కపినాదస్య ధీమతః
దేవదానవ దుర్ధర్షం ఘోరం యుద్ధం వ్యజాయత॥

తా॥ ఈరీతిగా మైరావణునకు, బుద్ధిశాలియగు హనుమంతునకు దేవదానవులకు భయము కలిగించు ఘోరమైన యుద్ధము జరిగెను

శ్లో॥ అదృష్ట్వా రాక్షసస్వాంతం దృష్ట్వా రాఘవయోర్దశాం
చింతా ప్రపేదే హనుమాన్ సంప్రాప్తం సంకటం మహత్

తా॥ మైరావణుడు చచ్చునట్లు కనపడకపోవుటవలన రామలక్ష్మణుల దుర్దశ చూడవలసివచ్చినందువలన మిక్కిలి కష్టము కలుగగా హనుమంతుడు విచారమగ్నుడయ్యెను.

శ్లో॥ అథ చింతయమానం తం దుర్దండీ హితకారిణీ।
మైరావణస్య సాప్రాహ గతి స్నేహం సహోదరే।

తా॥ అట్లు చింతించుచున్న హనుమంతునితో ఆతనికి మేలుచేయునట్టి, సోదరునియెడ ప్రేమ పోయినట్టి మైరావణుని తోబుట్టువయిన దుర్దండి యిట్లు పలికెను.

శ్లో॥ జహి మైరావణం పాపం హనుమాన్ మా విచార్యతాం
దుర్భరం సర్వలోకానాం శల్య మేష న సంశయః॥

తా॥ ఓ హనుమంతుడా ! విచారింపవద్దు. పాపియైన ఈ మైరావణుని చంపుము. ఈతడు నిస్సందేహముగా లోకములకు భరింపరాని విషబాణమువంటివాడు.

శ్లో॥ భృంగరూపధరాః ప్రాణాః సంచరన్తి శిలాంతరే
యావన్న తేషాం హననం తావన్నాస్య మృతి ర్ధ్రువమ్

నీ కుమారునకు హాని చేయుటంవంటి వానితోపాటు యే అప కారములు చేసితినో వాని నిప్పుడు క్షమింపుము.

శ్లో॥ అద్యప్రభృతి తే పుత్రో నీలమేఘో ఽరిమర్దనః
పాలయిష్యతి రాజ్యమ్మే భూయాసం సాధ్యకర్మణి॥

తా॥ నేటినుండి నీ పుత్రుడు, శత్రునాశకుడు అగు నీల మేఘుడు నా రాజ్యమును పాలించుగాక ! నేను సాధ్యమగు కర్మయందు వర్తింతును.

శ్లో॥ ఇతి పలపమానంతం దుర్దండీ భ్రాతరం సతీ
ఉవాచ దీనాం వాచంస్త్రై సాశ్రుగద్గదః కంధరా॥

తా॥ అని పలికెడి సోదరుడు మైరావణునితో కన్నీరు నింపినదై కోపముచే మాట పెగలకుండనుండ దీనముగానిట్లు పల్కెను.

శ్లో॥ అయి భ్రాతః పురా కిన్ను బుద్ధిర్నైతాదృశీ తవ
అహం తవ స్వసా హ్యేషః నీలమేఘోపి మత్సుతః॥

తా॥ సోదరా ! నీకీ బుద్ధి పూర్వమేల లేకపోయినది. నీ సోదరిని నేను నా కుమారుడు ఈ నీలమేఘుడు.

శ్లో॥ ఆవాం కేనాపరాధేన కారాగృహ నివేశితే
నిగళైశ్చ మహాభారైః సంయుతే కేన చాగతా॥

తా॥ మేము ఏ అపరాధముచేత కారగృహమునసుంచ బడితిమి ? ఏ అపరాధము కారణముగా మాకు మిక్కిలి బరు వయిన సంకెళ్ళు బిగించితివి ? మరల నేను ఎవరి వలన వాని నుండి బయటపడితిని ?

శ్లో॥ త్వయా నిష్కారణం భ్రాతః పాతితే దుఃఖసాగరే
ఆవామ ద్ధార యాంచక్రే కపిరూపేణ దైవతమ్॥

తా॥ ఓ సోదరా ! నిష్కారణముగా మేము నీచే దుఃఖ సముద్రమున ముంచబడితిమి. మమ్ము దైవము వాన రూపమున వచ్చి ఉద్ధరించెను.

శ్లో॥ నాసహిష్ట త వోత్సేకం సర్వలోక ప్రబాధకం
సనా్మర్గవర్తినో ర్యాన్నం ఆవయో రిష్టదైవతమ్॥

తా॥ మంచినడవడితో నున్న మా యొక్క ఇష్ట దైవము సర్వ లోకములను బాధించు నీ అహంకారమును సహింపలేదు.

శ్లో॥ జన్మ పభృతి మత్పుత్రో మన్ముఖం నైవ పశ్యతి
తత్రోత్సుకా ప్యహం భ్రాతః తన్ముఖం నావలోకయమ్

తా॥ పుట్టిననాటినుండి నా కుమారుడు నా ముఖమును చూడలేదు. వానిని చూచుట యందిష్టమున్నను సోదరా ! నేనూ ఆతని ముఖమును చూడలేదు.

శ్లో॥ అద్య త్వా న్నిహతం విద్ధి శూరేణ కపినా ఽమునా
జీవితాశాం పున ర్జ్యాయ స్త్యజ లోకోప కారిణీమ్॥

తా॥ ఈ పరాక్రమ వంతుడగు హనుమంతునిచేతిలో నేడు చచ్చుట తప్పదని తెలిసికొనుము. ఓ అగ్రజుడా ! లోకమునకు అపకారమొనర్చు నీ జీవితమందిక ఆశను వదలుము.

శ్లో॥ దుర్దండి వచనం శ్రుత్వా పరుషం పరుషాక్షరం
మైరావణో రురో దోచ్చైః ముక్తకంఠో హ్యనాథవత్॥

తా॥ కఠినములగు మాటలతో కూడిన దుర్దండి చెప్పిన విషయమువిని అనాథవలె ముక్తకంఠముతో మైరావణుడు బిగ్గరగా ఏడ్చెను.

శ్లో॥ ఇతి రుదతి దితేస్సుతే హనూమాన్
ప్రతివచనా దితి తాం నివార్య తూర్ణం
వచన మపి జగాద లోకనాథః
సకలహితావహ మార్యపూజ్యభావః॥

తా॥ అని రాక్షసుడగు మైరావణుడేడ్చుచుండ హనుమంతుడు తన మాటచే వాని ఏడ్పునాపి పూజ్యులకు వందనీయుడు, లోకనాథుడు అగు నాతడు అందఱకు మేలగు మాట చెప్పెను.

శ్లో॥ స్వయ మివ హననాయ రాక్షసానాం
సుఖ కరణాయ సతా మ్మమావతారః
అల మిహ కృపయా దురాత్మభావే
సదపకృతే రయ మేవ మూలహేతుః॥

తా॥ రాక్షసులను సంహరించుటకు, మహాత్ములకు సుఖము కల్గించుటకే నా అవతారము. ఈ దురాత్ముని యందు దయ వహించదగదు. మంచివారికపకారము జరుగుట కితడే మూలకారణము.

శ్లో॥ ఇత్యభాష్య వచ శ్రీమాన్ దుర్దండిం మారుతాత్మజః
ఇను హోవాచ వచనం మైరావణ మరిందమః॥

తా॥ అని వాయునందనుడు మర్దించికో పల్కె. శత్రు నాశకుడగు నతడు మరల మైరావణునితో నిట్లనెను.

శ్లో॥ హన్త మైరావణోన్మత్త దుర్బుద్ధే బంధుపీడన !
అవజానాసి న స్సర్వాన్ కథం రావణచోదితః॥

తా॥ ఓ దురాత్ముడా ! మదించినవాడా ! దుర్బుద్ధికల వాడా ! బంధువులను పీడించువాడా ! మైరావణుడా నీవు రావణునిచే ప్రేరేపింపబడిన వాడవై మమ్మందఱను గుర్తించలేకపోతివి.

శ్లో॥ ఈదృశం వ్యసనం ప్రాప్తం రావణః కిన్నబుద్ధ్యతి
కిన్తు దుష్టహృదయ స్త్వం వై పరహస్తేన కార్యవిత్॥

తా॥ ఇట్టి కష్టము ప్రాప్తించినదని రావణుడు తెలిసికొనుటలేదా ? ఓ మైరావణా ! పరప్రేరణచే కర్తవ్యమెరుగు నీవు నిజముగా దుష్టహృదయుడవు.

శ్లో॥ బంధుభావేన తే మృత్యు ర న్తరే స జహాస్యతి
నీలమేఘముఖా భృత్యా మహా దైశ్వర్య మీదృశం
సంతోష మగమం తావ త్త్వాత్మానం న బుధ్యసి॥

తా॥ బంధువువలె మృత్యువు లోనికి ప్రవేశించు చున్నది. ఇట్టి మహాదైశ్వర్యమును తెలిసికొని నీలమేఘుడు మొదలగు నీ సేవకులు సంతోషమును పొందుచున్నారు. నీవుమాత్రము నీ ఆత్మను తెలిసికొనుటలేదు.

శ్లో॥ కిన్నజానాసి మమ ఘాతన్ రాఘవో జగతాంపతే
సీతా మివ రమాం దేవీం రావణో దుర్మతి ర్యథా॥

తా॥ ఓ మూఢుడా ! నీవును దుర్మతియగు రావణుని వలె రామలక్ష్మణులను జగన్నాయకులుగా, సీతాదేవిని సాక్షాత్తు శ్రీమహాలక్ష్మిగా తెలిసికొనుటలేదా ?

శ్లో॥ స్వసార మపి సాక్షా త్తే - దుర్దండీం సాధుసమ్మతాం
కథం బధ్నాసి పాపాత్మన్ శృంఖలాభి స్సపుత్రకామ్॥

తా॥ సాక్షాత్తు నీకు చెల్లెలయినట్టి సజ్జనులచే కొనియాడబడునట్టి దుర్దండిని ఓ పాపాత్ముడా ! కుమారునితో కూడ ఏల బంధించితివి ?

శ్లో॥ మహాపరాధిన స్తేఽద్య మరణం సాంప్రతం భవేత్
అసాధురపి సాధుత్వం భజతే సాధుసంగమాత్॥

తా॥ మహాపరాధియన నీకు యిప్పుడు మరణము తప్పదు. మంచివారి స్నేహముతో దుర్మార్గులును మంచి వారగుచున్నారు.

శ్లో॥ భవాదృశో న దృష్టో వై దుర్జనో జగతాం త్రయే
ఇత్యువాచ నయాభిజ్ఞో అంజనానంద వర్ధనః॥

తా॥ కాని నీవంటి దుష్టుని మాత్రం ఈ ముల్లోకము లందును, చూడలేదు అని అంజనాదేవి కుమారుడు, నీతి కోవిదుడు అగు హనుమంతుడు పల్కెను.

శ్లో॥ పాదే నాక్రమ్య వామేన రాక్షసం పర్వతోపమం
పాదం ప్రసారయామాస భృంగనాశాయ దక్షిణమ్॥

తా॥ పర్వతముతో సమానమైన ఆ రాక్షసుని ఎడమ పాదముతో త్రొక్కియుంచి కుడిపాదమును తుమ్మెదలను చంపుటకై ప్రసరింప జేసెను

శ్లో॥ తే నోత్క్షిప్య శిలా శ్శీఘ్రం భృంగా న్సంచరతో ష్యధః
యుగప త్పాదపద్మేన చూర్ణయామాస మారుతిః ॥

తా॥ అట్లు ఆ పాదముతో వెంటనే శిలను తొలగించి క్రింద తిరిగెడి తుమ్మెదలను హనుమంతు డొక్కమారు తన పాదపద్మముతో నలిపివైచెను.

శ్లో॥ హతేషు ప్రాణరూపేషు భృంగేషు దితినందనః
క్షణా న్మమార నిస్సారః పాకశాసన కీటవత్ ॥

తా॥ తన ప్రాణముయొక్క రూపములయిన తుమ్మెదలు చనిపోగా మైరావణ దైత్యుడును ఆరుద్రపురుగువలె క్షణములో నిస్సారుడై చచ్చెను.

శ్లో॥ హతే తస్మి న్పురే నాథే తత్రాభూ ద్రోదనస్వనః
తాన్ శ్రుత్వా కరుణాలాపాన్ దయార్ద్రహృదయ స్తదా॥
ప్రత్యేకం మార్జయామాస నేత్రాశ్రూణి కపీశ్వరః॥

తా॥ అట్లు ఆ పట్టణముయొక్క నాయకుడు పోగా అచ్చట ఏడ్పులు మిక్కుట మయ్యెను. అట్టి కరుణపూర్ణములైన ఆక్రందన విని దయాపూర్ణుడైన హనుమంతుడు కూడ అప్పుడు కంట తడి పెట్టెను.

శ్లో॥ నిగళా న్మోచయామాస దుర్దండీం తత్సుతం తథా
పాతాళలంకా రాజ్యే ఽస్మిన్ నీలమేఘం నియుజ్య సః॥

తా॥ దుర్దండిని, ఆమె కుమారుడగు నీలమేఘుని బంధనమునుండి విడిపించెను. ఆ పాతాళలంకా రాజ్యమున కధిపతిగా నీలమేఘుని నియమించి,

శ్లో॥ దుర్దండీ భార నీరేణ సారసేన జలేనవై
అభిషిచ్య తదా శ్రీమాన్ జగాద కపినాయకః।

తా॥ దుర్దండి సరస్సునుండి మోసుకొని వచ్చిన నీటితో ఆతనికి అభిషేక మొనర్చి అప్పుడు వానర నాయకుడు, శ్రీమంతుడు, అగు హనుమంతు డిట్లు పల్కెను-

శ్లో॥ రాజ్యం పాలయ ధర్మేణ యతో ధర్మ స్తతో జయః
అధర్మం మా కురు శ్రీమన్ స్వప్నేపి న కదాచన॥

తా॥ ఓ శ్రీమంతుడా ! రాజ్యమును ధర్మము తప్పక పాలింపుము ఏలన ధర్మ మెచ్చట నుండునో అచ్చటనే జయముండును. కలలో కూడ ఎప్పుడును అధర్మ మాచరింపకుము.

శ్లో॥ అధర్మ మాచరన్ దుష్టో హతో మైరావణో రణే

తా॥ అధర్మ మాచరించుట వలన దురాత్ముడగు మైరావణుడు యుద్ధమున చచ్చెను.

శ్లో॥ ఏవం వదన్తం కపియూథవర్యం
ప్రణమ్య సాష్టాంగ మభంగవిక్రమం
స్తోత్రై రనేకైః శ్రుతిమౌళిసారైః
తుష్టావమాత్రా సహ నీలమేఘః॥

తా॥ అన్ని పల్కు వానర శ్రేష్ఠుడు, అవక్రవిక్రముడు అయిన హనుమంతునకు సాష్టాంగ నమస్కారములు చేసి తల్లితో కూడి నీలమేఘుడు వేదార్థసారములగు అనేక స్తోత్రములతో హనుమంతుని స్తోత్రము చేసెను.

## —: నీ ల మే ఘ స్తు తి : :—

శ్లో॥ సచ్చిదానందరూపాయ సృష్టి స్థిత్యంతకారిణే
చరాచర స్వరూపాయ పురాణపురుషాయచ॥

తా॥ సత్, చిత్, ఆనందము లనబడు సత్యము, జ్ఞానము, ఆనందము తానే అయియున్నట్టియు, సృష్టికి, స్థితికి, లయకు కారకుడైనట్టి, చరాచరము లన్నిటి రూపు తానే యైనట్టి, పురాణ పురుషుడైనట్టి హనుమంతునకు నమస్కారము.

శ్లో॥ నమో లోకశరణ్యాయ దీనసంరక్షణాయ చ
భక్తపాలన రూపాయ ఆపన్నార్తి హరాయచ॥

తా॥ లోకములన్నిటికి శరణ్యుడైనటువంటి, దీనులను రక్షించునట్టి, భక్తులను పాలించు రూపము కల్గినట్టి, ఆపద నందినవారి దుఃఖమును పోగొట్టునట్టి హనుమంతునకు నమస్కారము.

శ్లో॥ త్వత్పాదదర్శనా ద్దుఃఖ శేషం నః ప్రణశ్యతు
అనేకజన్మ సాహస్రైః సంభృతం పుణ్య మస్తి మే॥

తా॥ నీ పాదములను దర్శించుట వలన మాకున్న దుఃఖ శేషము నశించుగాక ! నాకు అనేక వేల జన్మలనుండి కూడబెట్టుకొన్న పుణ్యమున్నది.

శ్లో॥ నచే త్కథం త్వదీయాంఘ్రి దర్శనం స్యా దహేతుకం
ఆగామి శ్రేయసో హేతు ర్వర్తమానాఘ శోధకం
పూర్వపుణ్యార్జితా కస్య నాశాస్యం తవ దర్శనమ్॥

తా॥ కాకున్న కారణము లేకుండ నీ పాద దర్శన మెట్లు కలుగును ? రానున్న శుభములకు కారణమై, ప్రస్తుత పాపములను తొలగించునదై పూర్వ పుణ్యమువలన సంపాదించబడు నీ దర్శనము ఎవరికి ఆశీస్సుల నీయదు!

శ్లో॥ అద్య మే సఫలం జన్మ భవ త్పాదాబ్జ వందనాత్
కృతార్థాః పితర స్సర్వే మమ వంశ సముద్భవాః॥

తా॥ నీ పాద పద్మములకు వందనము చేయుట వలన నేటికి నా జన్మ సఫలమైనది. నా వంశమున జన్మించిన పితృదేవత లందఱు కృతార్థులైరి.

శ్లో॥ ఫలితాః క్రతవోనూనం విప్రాః సత్యాశిషోఽభవన్
యథార్థో జనవాదశ్చ చిరాయ భవితా మమ॥

తా॥ క్రతువులన్నియు నిశ్చయముగా సఫలములైనవి. బ్రాహ్మణులు సత్యమైన ఆశీస్సు కలవారైరి. జనవాక్యము కూడ నాయెడ నింత కాలమునకు యథార్థమయ్యెను.

శ్లో॥ అపి జంతు ర్మహద్దుఃఖో జీవ న్భద్రాణి పశ్యతి॥

తా॥ ప్రాణి మిక్కిలి దుఃఖముతో కూడినదైనను జీవించియున్నచో శుభముల నందుచున్నది.

శ్లో॥ మైరావణోఽపి దుష్టాత్మా మాతులో మమ నిర్దయః
సద్గతిం ప్రాపృయా త్సత్య మితి మే నిశ్చితా మతిః॥

తా॥ దుష్టాత్ముడు, దయాహీనుడు అయినను, మైరావణ నామకుడగు నా మేనమామయు సద్గతినే పొందునని నా దృఢమైన విశ్వాసము.

శ్లో॥ ఆశ్లిష్ట సర్వగాత్రోఽయం సాక్షాత్కృత పదద్వయః
త్వత్పాదఘాత సమ్మృష్టః హత ప్రాణ సమీరణః॥

తా॥ ఏలన అతడు యుద్ధ కారణమున నీ దేహమంతను కౌగిలించుకొన్నాడు. నీ పాదపద్మముల సాక్షాత్కార మందినాడు. నీ పాదముల దెబ్బల ననుభవించి ప్రాణములను కోల్పోయినాడు.

శ్లో॥ ఏవం విధః కథం స్వామిన్ నముచ్యేత భవాంబుధేః
అన్యథా కథ మన్యేషాం ముక్త్యాశా భజతా మపి॥

తా॥ ఇట్టివాడు సంసారసాగరమునుండి ఎందుకు ముక్తి నందడు? అట్లు అతడు ముక్తినందకున్న సేవించువారగు నితరుల కయినను ముక్తికల్గు ఆశ ఎట్లుండును?

శ్లో॥ అద్య ప్రభృతి నః స్వామిన్ భూయా ద్భక్తిః పదాబ్జయోః
ధర్మార్థ కామమోక్షాణాం ఇయమేవ ప్రసూర్మమ॥

తా॥ ఓ స్వామీ! నేటినుండి మాకు నీ పాదపద్మము లందు భక్తి లభించుగాక! నాయొక్క ధర్మ, అర్థ, కామ, మోక్ష చతుర్విధ పురుషార్థములకు మూలము నీ పాద భక్తియే.

## —: ఆంజనేయ మంగళ శ్లోకాః :—

శ్లో॥ వైశాఖే మాసి కృష్ణాయాం దశమ్యాం మందవాసరే
పూర్వాభాద్ర ప్రభూతాయ మంగళం శ్రీహనూమతే॥

తా॥ వైశాఖమాసమున బహుళ పక్షమున దశమి తిథి నాడు శనివారమున పూర్వాభాద్ర నక్షత్రమున జన్మించిన హనుమంతునకు మంగళము.

శ్లో॥ కరుణారస పూర్ణాయ ఫలాపూప ప్రియాయచ
నానా మాణిక్య హారాయ మంగళం శ్రీహనూమతే॥

తా॥ దయారస పరిపూర్ణుడు, పండ్లు, అప్పములయం దిష్టము కలవాడు, వివిధములైన మాణిక్య హారములు కల వాడు నగు హనుమంతునకు మంగళము.

శ్లో॥ సువర్చలా కళత్రాయ చతుర్భుజ ధరాయ చ
ఉష్ట్రారూఢాయ వీరాయ మంగళం శ్రీహనూమతే॥

తా॥ సువర్చల భార్యగా కలవాడును, నాల్గు చేతులు ధరించినవాడును, ఒంటె నెక్కినవాడును, వీరుడును అగు హనుమంతునకు మంగళము.

శ్లో॥ దివ్యమంగళ దేహాయ పీతాంబర ధరాయచ
తప్తకాంచన వర్ణాయ మంగళం శ్రీహనూమతే॥

తా॥ దివ్యమంగళ విగ్రహము కలవాడును, పసుపురంగు వస్త్రములను ధరించినవాడును, పటము పెట్టిన బంగారు పురంగు కలవాడును అయిన హనుమంతునకు మంగళము.

శ్లో॥ భక్తరక్షణ శీలాయ జానకీ శోకహారిణే
జ్వలత్పావకనేత్రాయ మంగళం శ్రీహనూమతే॥

తా॥ భక్తులను రక్షించుటలో లక్షణముగా కలవాడును, సీతాదేవి దుఃఖమును పోగొట్టిన వాడును, మండుచున్న అగ్ని వంటి నేత్రములు కలవాడును అగు హనుమంతునకు మంగళము.

శ్లో॥ పంపాతీర విహారాయ సౌమిత్రి ప్రాణదాయినే
సృష్టి కారణభూతాయ మంగళం శ్రీహనూమతే॥

తా॥ పంపా సరోవరము ఒడ్డున విహరించుచుండు వాడును, లక్ష్మణునకు ప్రాణదానము చేసినవాడును, సృష్టికి కారణభూతుడును అయిన హనుమంతునకు మంగళము.

శ్లో॥ రంభావన విహారాయ గంధమాదన వాసినే
సర్వలోకైకనాథాయ మంగళం శ్రీహనూమతే॥

తా॥ అరటితోటలయందు విహరించువాడును, గంధమాదన పర్వతమున నివసించువాడును, సర్వ లోకములకు ప్రభువును అయిన హనుమంతునకు మంగళము.

శ్లో॥ పంచాననాయ భీమాయ కాలనేమి హరాయచ
కౌండిన్యగోత్ర జాతాయ మంగళం శ్రీహనూమతే॥

తా॥ ఐదు ముఖములు కలవాడును, భయంకరుడును, కాలనేమిని సంహరించినవాడును, కౌండిన్య గోత్రమునందు జన్మించినవాడును అయిన హనుమంతునకు మంగళము.

శ్లో॥ ఇతి స్తుత్వా హనూమంతం నీలమేఘో గతవ్యథః
ప్రదక్షిణ నమస్కారాన్ పంచవారాన్ చకారసః॥

తా॥ అని హనుమంతుని స్తుతించి బాధలన్నియు తొలగినవాడై నీలమేఘుడు హనుమంతునకు అయిదు పర్యాయములు ప్రదక్షిణ నమస్కారములు చేసెను.

శ్లో॥ తతో హనుమదాజ్ఞప్తో భుంజానో విషయాన్స్పహాన్
యథోక్త విధినా రాజ్యం పాలయామాస ధర్మవిత్॥

తా॥ పిమ్మట హనుమంతునిచే ఆజ్ఞాపింపబడినవాడై ధర్మజ్ఞుడైన నీలమేఘుడు బహువిషయ సుఖములనుభవించుచు శాస్త్రవిధిని తప్పక రాజ్యమును పాలించెను.

శ్లో॥ అంజనాతనయోఽప్యాశు మార్గమాణ స్సరాఘవౌ
దదర్శాంతఃపురే సుప్తౌ పేటికా మధ్యవర్తినౌ॥

తా॥ ఆంజనేయుడును వెంటనే రామలక్ష్మణులను వెదకుచు అంతఃపురమున పెట్టెయందు నిదురించుచునున్న వారిని చూచెను.

శ్లో॥ గృహీత్వా పేటికాం సద్యః కక్షమూలేఽన్యథా కపిః
పునర్యయౌ మహావీరః ప్రథమాగమన క్రమాత్॥

తా॥ వెంటనే ఆ పెట్టెను తీసికొని చంకలో పెట్టుకొని

వీరుడగు హనుమంతుడు తాను మొదట వచ్చిన క్రమము లోనే మరల వెడలెను.

శ్లో॥ నిజాగమన మేకాగ్రం ప్రతీక్షన్తం మహాబలం
దీర్ఘదేహీ సుతంమార్గే దృష్ట్వా మత్స్యవల్లభమ్॥

తా॥ ఏకాగ్రతతో తన రాకకై ఎదురు చూచుచున్న మహాబలవంతుడు, దీర్ఘదేహి కుమారుడు అయిన మత్స్యవల్లభుని హనుమంతుడు మార్గమధ్యమున చూచెను.

శ్లో॥ దూరా న్నిరీక్ష్య పితరం ప్రత్యుత్థాయ కృతాంజలిః
ప్రోవాచ వచనం సాంత్వం వినయేన నయేనచ॥

తా॥ దూరము నుండియే తండ్రిని చూచినవాడై మత్స్యవల్లభుడు ఎదురేగి నమస్కరించి వినయముతోడను నీతితోడను నెమ్మదిగా ఇట్లు పల్కెను-

శ్లో॥ భృత్యభావో న తే స్వామిన్ మయి కుత్సితజీవితే
యత స్సత్యపి మూఢేఽస్మిన్ త్వమాయంధార్యతే భరః॥

తా॥ ఓ స్వామీ ! నీచమైన జీవితముకల నాయందు నీకు భృత్యుడనను భావము లేదు. అది ఎట్లన మూఢుడ నగు నేనుండగనే కష్టమంతయు నీవే వహించుచున్నావు.

శ్లో॥ కృతేషు పితరః పుత్రాన్ వివిధేషు నియుంజతే
తథాపి న నియుక్తోఽస్మిన్ క్వాచి దర్థే త్వయా గురో॥

తా॥ తండ్రులు తమ బిడ్డలను వివిధ కార్యములందు నియోగింతురు. కాని ఓ తండ్రీ! నీచే నేను ఒక్క పని యందును నియోగింప బడలేదు.

శ్లో॥ తదాత్మాన మిదం మన్యే త్వత్కృపాయా అగోచరం
సతాం న బుద్ధిభేదోఽస్తి మమ దౌర్భాగ్య మీదృశమ్॥

తా॥ కావున నన్ను నీ దయకు అనర్హునిగా ఎంచు చున్నాను. పూజ్యులకు బుద్ధిభేదము వుండదు. కావున ఇందుకు కారణము నా దురదృష్టమే.

శ్లో॥ ఇతి ప్రేమరసావిష్టం తనయం మత్స్యవల్లభం
పరమానంద సందోహా త్కపి స్సాస్రు రభూ త్తథా॥

తా॥ అని పల్కెడి ప్రేమరసపూర్ణుడైన కుమారుని మత్స్యవల్లభుని చూచి హనుమంతు డప్పుడు పరమానంద ముచే ఆనందబాష్పముల నింపెను.

శ్లో॥ యదుక్తం భవతా పుత్ర! తన్న త్వ య్యుపపద్యతే
కిన్తు నిర్మాయ సన్మాల భక్తి ర్మ య్యనపాయినీ॥

తా॥ ఓ కుమారా! నీవు చెప్పిన దేమియు నీయందు చెల్లదు; ఏలన నీవు నాయందు అకళంక భక్తి కల్గియున్నావు.

శ్లో॥ స తే గౌరవ మాధత్తే నిరాదిష్ట విధేయతాం
తథాపి పుత్రభావేన నిరస్త గురుతా క్రమః॥
క్వచి దద్య నియోక్ష్యామి తవ సంతోష కారణాత్॥

తా॥ అదియే ఆదేశింపబడని విధికల గౌరవమును నీ కిచ్చుచున్నది. అయినను పుత్రభావముచే నైన గౌరవమును ఆలోచించక నీసంతోషమునకై నిన్నొక పనియందు నియోగించుచున్నాను.

శ్లో॥ దుర్దండితనయో హ్యాస్తి నీలమేఘాహ్వాయ స్సుధీః
మద్భక్తే ష్వగ్రగణ్యశ్చ తృణీకృత పురందరః ॥

తా॥ నీలమేఘుడను పేరుకల దుర్దండి కుమారుడు ఉత్తముడు కలడు. ఆతడు నా భక్తులలో మొదట లెక్కింపదగినవాడు, ఇంద్రునికూడ తిరస్కరింప జాలినవాడు.

శ్లో॥ కృతరాజ్యా పదిష్టోభూ న్మయా భక్తానుకంపినా
సోఽయం దుర్దండికాపుత్రో రక్షణీయో మదాజ్ఞయా॥

తా॥ భక్తులయందు దయకల నాచే ఆతడు రాజ్యాభిషిక్తుడు చేయబడెను. నా ఆజ్ఞచే నీవు దుర్దండి కుమారుడగు ఆ నీలమేఘుని రక్షించుచుండుము.

శ్లో॥ రాక్షసాః క్రూరకర్మాణో విధాస్యన్తి విమాననాం
అత స్సుఖేన సన్తిష్ఠ మదాజ్ఞాం పరిపాలయన్॥

తా॥ క్రూరకర్మలు కల రాక్షసులు అగౌరవమును కల్గించుచుందురు. కావున నా ఆజ్ఞచే వానిని రక్షించుచు సుఖముగా నుండుము.

శ్లో॥ ఇత్యాదిశ్య సుతం శ్రీమాన్ హనుమాన్ మారుతాత్మజః
జగామ మనసా సేనాం సుగ్రీవే ణాభిరక్షితామ్ ॥

తా॥ అని శ్రీమంతుడు, వాయునందనుడు అగు హనుమంతుడు తన సేనయు నాదేశించి సుగ్రీవునిచే రక్షింపబడు చున్న సేనకడకు మనోవేగముతో వెడలెను.

శ్లో॥ యావన్నాస్తగతస్సోమో యావన్నోదేతి భాస్కరః
తావదేవాశు సంప్రాప్తో వానరాణాం చమూం హరిః॥

తా॥ చంద్రుడస్తమించకముందే, సూర్యుడింకను ఉదయించకముందే అతివేగముతో హనుమంతుడు వానర సేనకడకు వచ్చెను

శ్లో॥ నిజవాలేన సంవేష్ట్య యథాపూర్వాం చమూం కపిః
ద్వారదేశమనుప్రాప్తస్తస్థౌ ధ్యాయన్ రఘూత్తమౌ॥

తా॥ హనుమంతుడు తన తోకతో వెనుకటివలెనే వానరసేనకంతకు కోటవలె చుట్టుప్రాకారము నేర్పాటుచేసి దాని ద్వారముకడ రామలక్ష్మణులను ధ్యానించుచు ఉండెను.

శ్లో॥ ఏవం ప్రభావో హి మహాన్కపీశ్వరః
సురాసురాణామపి దుష్ప్రధర్షః
న చామునా కోఽపి సమాన విక్రమో
జగత్త్రయే చేతి మతిర్మమ ప్రభో॥

తా॥ మహానుభావుడగు హనుమంతుడు ఇంతటి ప్రభావముకలవాడు. దేవతలకు, రాక్షసులకును తిరస్కరింపరానివాడు. ఓ ప్రభూ ! ముల్లోకములందును ఈ హనుమంతునితో సమానమైన పరాక్రమము కలవాడు లేడని నా అభిప్రాయము.

శ్లో॥ ఇత్యగస్త్యకథితం రఘూత్తమో
వాయుపుత్ర చరితం నిశమ్య వై
ప్రాప్తవాన్ సపది సానుజో ముదం
విస్మయం చ పరమం యశస్వినా మునే॥

తా॥ ఓ మైత్రేయ మహాముని! ఇట్లు అగస్త్యునిచే చెప్పబడిన హనుమంతుని గాథను విని లక్ష్మణునితో పాటు శ్రీరామచంద్రుడు మిక్కిలి ఆశ్చర్యము, ఆనందము పొందెను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం పంచముఖ
హనుమద్వివరణే పరాశర మైత్రేయ
సంవాదే మైరావణ వధోపా
ఖ్యానం నామ
సప్తచత్వారింశత్పటలః

# అష్టచత్వారింశత్పటలః

## వైనతేయ గర్వాపహరణ కథనం

శ్రీ పరాశరః—

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి శ్రూయతాం పాపనాశనమ్
మైత్రేయ! మిత్రభావేన సావధానమనా శ్రుణు॥

తా॥ ఓ మైత్రేయ మహాముని! నియమముగల స్నేహ

భావముచే పాపములన్నిటిని పోగొట్టగల్గిన మతియొక విశే
షమును చెప్పుచున్నాను. సావధానుడవై వినవలసినది.

శ్లో॥ హనూమా నంజనాసూనుః సచ్చిదానంద విగ్రహః
గంధమాదన శైలాంత స్వర్ణరంభా వనాశ్రయః॥

తా॥ అంజనాదేవి కుమారుడును, సచ్చిదానంద రూపమగు మూర్తి కలవాడును గంధమాదన పర్వత ప్రాంతమున కల బంగారు అరటితోటయే నివాసముగా కలవాడును అగు హనుమంతుడు,

శ్లో॥ అవాప్త సర్వకామో ఽపి సర్వకామ్య ఫలప్రదః
స ఏవ హృది సంవీక్ష్య లోకానుగ్రహ కామ్యయా॥

తా॥ కోర్కెలన్నిటిని తీర్చగలవాడై సమస్తములగు కోరికలు తీరియున్న వాడయినను లోకమంతటిననుగ్రహించు కోర్కెకలవాడై మనసునందాలోచించి

శ్లో॥ రామపాదాంబుజ ద్వంద్వ ధ్యాన నిర్ధూత కల్మషః
అభూ న్నిజపరీవార సంవృతో ధ్యానతత్పరః॥

తా॥ శ్రీరామచంద్రుని పాదద్వయమును ధ్యానించుటచే సర్వపాపములు తొలిగినవాడై తన పరివారముతో కూడి ధ్యానతత్పరుడై యుండెను.

శ్లో॥ అథాంతరే మహాసత్త్వో వైనతేయః ఖగేశ్వరః
నిజ సత్త్వానుసంధానాత్ గర్వితో దృఢవిక్రమః॥

తా॥ ఇంతలో మిక్కిలి బలముకలవాడు. వినతా

తనయుడు, పక్షిరాజు అగు గరుత్మంతుడు తన బలమును ఎంచుకొని గర్వించినవాడై దృఢపరాక్రముడై

శ్లో॥ కోవా భవే న్నియుంజానో యుద్ధకర్మ మమాగతః
దేవో వా దానవో వాపి నరో వాఽఽపన్నగోపివా
యక్షోవా సంభృత ప్రాణ స్సమ పౌరుష విక్రమః॥

తా॥ దేవతలందుకాని, రాక్షసులందుకాని, నరు లందుకాని, సర్ప జాతియందుకాని, యక్షులందుకాని. ఏ ఒక్కడు నా ఎదుట యుద్ధముచేసి నిలువగలవాడు వున్నాడు ? ప్రాణములు దక్కించుకొను పౌరుష పరాక్రమ వంతుడెవ్వడున్నాడు ?

శ్లో॥ యః కశ్చిదపి నాస్త్యేవ యోధితే జగతాం త్రయే

తా॥ ఈ ముల్లోకములు గాలించినను నాతో యుద్ధ మున నిల్వగలవా డెవ్వడూ లేడు.

శ్లో॥ లబ్ధప్రతిష్ఠాః కపయః శైలేయ వహనా దపి
సదృశాస్తే కథం మే స్యుః నిస్సీమ బలశాలినః॥

తా॥ పర్వతములు మోయుటయందును వానరులు కీర్తినందియున్నారు. అంతులేని బలవంతుడ నయిన నాతో వారును ఎట్లు సమానులు కాగలరు ?

శ్లో॥ అహం వహామి పక్షాభ్యాం కుక్షిస్థాఖిల విష్టపం
కృష్ణం నారాయణం సాక్షాత్ అప్రకంప్య సురాసురైః॥

తా॥ నేను లోకమంతటిని ఉదరమునందు వహించి

దేవదానవులకు కదల్పనయిన శక్యముకాని దేహముకల సాక్షాత్తు నారాయణమూర్తియగు కృష్ణుని నా రెక్కలతో మోయుచున్నాను.

శ్లో॥ బల గర్వాంధకారేణ మోహితశ్చ ఖగేశ్వరః
ఆత్మాన మవిజానాతి తుచ్ఛీకృత జగత్త్రియీ॥

తా॥ అని బలగర్వము కనుగప్పి మోహితుడై ముల్లోకములను లెక్కచేయని గరుత్మంతుడు ఒడలు తెలియక మైమరచి యుండెను.

శ్లో॥ కదాచి ద్ద్వారకాపుర్యాం శ్రీకృష్ణో యదునందనః
రత్నసింహాసనాసీనః సహిత స్సత్యభామయా॥

తా॥ ఒకమారు యదుకులభూషణుడగు శ్రీకృష్ణుడు ద్వారకానగరమున త్యభామతోకూడి రత్నసింహాసనము న నధిష్ఠించియుండి

శ్లో॥ సస్మార గరుడం గర్వ పరిహార విధిప్సయా
స చాగచ్ఛ న్మహావేగాత్ అనుధ్యాతో మహాత్మనా॥

తా॥ గరుత్మంతుని గర్వమును పోగొట్ట నెంచినవాడై తలచెను. అట్లు మహాత్ముడగు కృష్ణునిచే ధ్యానింపబడి గరుత్మంతుడు అతివేగముతో వెంటనే వచ్చెను.

శ్లో॥ ప్రాంజలిః ప్రణతో భూత్వా తస్థా వాజ్ఞా మనుస్మరన్
తతః ప్రోవాచ భగవాన్ వినతాతనయం హరిః॥

తా॥ వచ్చి అంజలి ఘటించి నమస్కరించినవాడై

కృష్ణుని ఆజ్ఞకై నిరీక్షించెను. అంతట భగవంతుడగు శ్రీకృష్ణుడు గరుడునితో నిట్లనెను-

శ్లో॥ వైనతేయ ! మహావేగ మహాబల పరాక్రమ !
సువర్ణకదలీ రమ్యే గంధమాదన పర్వతే
అనుధ్యాయతి ధర్మాత్మా హనుమాన్ భక్తవత్సలః॥

తా॥ ఓ వినతాతనయా ! గొప్పవేగముకలవాడా ! మహా బలపరాక్రమము కలవాడా ! బంగరు అరటిచెట్లచే రమ్యమైన గంధమాదన పర్వతమున ధ్యానమగ్నుడై భక్తసులభుడు, ధర్మాత్ముడు నగు హనుమంతుడున్నాడు.

శ్లో॥ తేన సంభాషణార్థం మే త మిహానయ సువ్రత

తా॥ ఓ సువ్రతుడా ! నేనాతనితో మాటాడవలసియున్నది. కాన ఆతని నిచ్చటికి తోడ్కొనిరమ్ము.

శ్లో॥ ఆజ్ఞప్తో హరిణా తార్క్ష్యో వేగేన జితమానసః
జగామ తత్క్షణాదేవ గంధమాదన పర్వతమ్॥

తా॥ అని కృష్ణునిచే ఆజ్ఞాపింపబడినవాడై గరుత్మంతుడు మనసును మించిన వేగముకలవాడై తక్షణమే గంధమాదన పర్వతమునకు వెడలెను.

శ్లో॥ తత్రాపశ్య త్కపిశ్రేష్ఠం నిశ్చలస్వాంత సంభ్రమం

తా॥ అక్కడ నిశ్చలమైన మనస్సుతో ధ్యానమొనర్చు వానరశ్రేష్ఠుడగు హనుమంతుని చూచెను.

శ్లో॥ హనూమతః పురస్థ్సిత్వా సోఽవష్టభ్య పదే ఖగః
ఉచ్చైరాకారయామాస స్థిరయోగ మిమం ముహుః॥

తా॥ గరుడుడు హనుమంతుని ఎదుట గర్వముగా నిల్చినవాడై స్థిరయోగమున నున్న హనుమంతుని బిగ్గరగా అనేక పర్యాయములు పిలచెను.

శ్లో॥ ఆహూతోఽసి కపిశ్రేష్ఠ శ్రీకృష్ణేన మహాత్మనా
యోగం విఘటయ ప్రాజ్ఞ మా కురుష్వ విలంబనం
త్వాం వినా నత్వహో గన్తుం దుర్లంఘ్యం కృష్ణశాసనం॥

తా॥ ఓ వానరశ్రేష్ఠా! మహాత్ముడగు శ్రీకృష్ణుడు నిన్ను పిలచుచున్నాడు. నీ యోగమును చాలించుము. ఓ మహాజ్ఞానీ! ఆలస్యము చేయకుము. శ్రీకృష్ణుని శాసనము అతిక్రమింప తగనిది కాన నిన్ను తీసుకొని వెళ్ళనిదే ఇచ్చటనుండి పోను.

శ్లో॥ నాపశ్యద్విషయం కించిత్ బాహ్యం కపికులాగ్రణీః
రామచంద్ర పదద్వంద్వ ధ్యాన నిశ్చల మానసః॥

తా॥ శ్రీరామచంద్రుని పాదద్వయమునందే ధ్యానముంచి నిశ్చల మనస్కుడై యున్న వానరవంశ శ్రేష్ఠుడగు హనుమంతుడీ బాహ్యవిషయమును దేనిని గమనించలేదు.

శ్లో॥ తదా సుపర్ణః కృష్ణాజ్ఞాం సంస్మరన్నతికాతరః
నిచిక్షేప నిజత్రోటిం తన్నాసవివరాంతరే॥

తా॥ అప్పుడు గరుత్మంతుడు కృష్ణాజ్ఞ నాలోచించుచు

క్కొని భయమందినవాడై తన ముక్కును హనుమంతుని ముక్కు రంధ్రములోనికి పోనిచ్చెను.

శ్లో॥ జ్ఞాత్వాపి నైకృతం తస్య సర్వభూతాంతరస్థితః
తూష్ణీ మాస్తే శక్ర ద్వార మజానన్నివ మారుతిః॥

తా॥ సర్వప్రాణుల అంతఃకరణముల సంచరించు హనుమంతుడు గరుత్మంతుడొనరించిన వికారచేష్టను గుర్తించియు ఆ దుష్ట వాసనతో నున్న నాశికాద్వారమును గుర్తించనటుల మిన్నకుండెను.

శ్లో॥ తదా తన్నిశ్చలం వీక్ష్య గరుడో గూఢ చేష్టతః
పున రాకారయాంచక్రే కర్ణాంతే న్యస్త చంచుకః॥

తా॥ అప్పుడు గరుత్మంతుడు నిశ్చలుడై మెదలకున్న మారుతిని చూచి ఆతని చెవికడ తన ముక్కునుంచి మరల పిలచెను

శ్లో॥ అథ యోగం కపిశ్రేష్ఠః ఉపసంహర్తు ముద్యతః
ప్రాణాయామం యథోక్తం వై కర్తుం సముపచక్రమే॥

తా॥ అటు పిమ్మట హనుమంతుడు యోగము నుపసంహరింప నెంచినవాడై యథావిధి ప్రాణాయామము విరమించ నారంభించెను.

శ్లో॥ దక్షిణేన విరేచ్యాదౌ నాసా రంధ్రేణ యోగవిత్
వామే నాపూరయ ద్వాయుం నిరోద్ధుం నాసికాంతరే।

తా॥ యోగవేత్తయగు హనుమంతుడు కుడిముక్కు రంధ్రముద్వారా వాయువును విడచి ఎడమముక్కు రంధ

ముచే వాయువును పీల్చినవాడై ముక్కులోపల భాగమున వాయువును కుంభించుచుండెను.

శ్లో॥ తదా సంకట మాపేదే భూతపూర్వ శకుంతరాట్
త ద్విరేచన వేళాయాం దూరా న్నిష్కాస్య తేఽమునా॥

తా॥ అప్పుడు అచ్చటనున్న పక్షీంద్రుడగు గరుత్మంతునకు మిక్కిలి కష్టమేర్పడెను. హనుమంతుడు ప్రాణాయామమున గాలిని విడు సమయమున ఆ గాలిచే గరుత్మంతుడు దూరముగ నెట్టివేయ బడుచుండెను.

శ్లో॥ పున రాపూర్య వేళాయాం నియతే నాసికాంతరః
కుంభ కేన యథా వాయుం నిరోధయతి మారుతిః
తథా నిరోధం నాసాంతం సస్మార పితరౌ స్వకౌ॥

తా॥ మరల పీల్చినపుడు ముక్కుకడకు తేబడుచుండెను. కుంభకమున వాయువును హనుమంతు డెట్లు నిరోధించుచుండెనో అట్లు ముక్కుచివర గరుడుడును నిరోధింపబడుచు ఆ బాధచే పితరులను తలచుకొనుచుండెను.

శ్లో॥ పీడాసముద్భవే దేవం ప్రాణాత్యయ విధాయినీ
ప్రాణాయామ శ్చ నిర్ముక్తః కపినా పన్నగాశనః॥

తా॥ ఇట్లు ప్రాణములు పోవునంతటి పీడ యేర్పడెను. హనుమంతుడు ప్రాణాయామము వీడగా గరుత్మంతుడును విడుదల నందెను

శ్లో॥ ఆత్మపీడా నిదానాచ్చ కృష్ణాజ్ఞా లంఘనా దపి
చుక్రోధ వినతాపుత్రః కాలాగ్నిసమ దీప్తిమాన్
ఉత్పపా తాథ వేగేన పక్షాభ్యాం ఖం లిఖన్ ముహుః॥

తా॥ తన పీడ కారణముగాను, కృష్ణాజ్ఞ మీరి నందునను మిక్కిలి కోపించినవాడై ప్రళయ కాలాగ్నివంటి దీప్తికల్గి తన రెక్కలతో గరుడుడు పలుమార్లు ఆకాశమును నొక్కుచు వేగముగా పైకెగిరెను.

శ్లో॥ కపిం గ్రహీతు కామేన ప్రవృద్ధ తనుమండలః
మేఘసంశ్లిష్ట పృష్ఠార్ధః వీక్షమాణః కపిం భువం॥

తా॥ హనుమంతుని తీసికొని పోనెంచి బాగుగా పెంచిన దేహముకలవాడై మేఘముల నొరిసికొను వీపుభాగముకల్గునట్లుగిరి లోకమును, ఆంజనేయుని చూచుచు

శ్లో॥ తద్గ్రహాంతర లాభాయ చకార గతి మండలీం
తథా విధోద్యమం తార్క్ష్యం వినిశ్చిత్యాంజనీసుతః॥

తా॥ ఆతనిని పట్టుకొనిపోవు నాలోచనతో వర్తులాకారముగ తిరుగుచుండెను. ఇట్టి గరుత్మంతుని యత్నము గుర్తించినవాడై ఆంజనేయుడు

శ్లో॥ వాల మభ్రంకషం సద్యః వర్ధయామాస తద్గ్రహే
తం తు దృష్ట్వా గరుత్మాన్ వై మేథి స్తంభమి వాయతం
భ్రమ శ్రమాపనోదాయ విశ్రాంత స్తత్ర వాలధౌ॥

తా॥ ఆ గరుత్మంతుని పట్టుటకై మేఘములను తాకునట్లుగా తన తోకను వెంటనే పెంచెను. గరుత్మంతుడు దానిని చూచి పొడవైన కట్టుకొయ్యగా తలచి తిరుగుట వలన నేర్పడిన శ్రమను పోగొట్టుకొన నెంచి తోకపై విశ్రాంతికై నిలచెను.

శ్లో॥ నిరుద్ధ సూర్యసంచారం సంఛన్న హనుమద్గిరిం
అపి విశ్రాంతితం ఛేత్తుం త మైచ్ఛ ద్వ్యయసాం పతిః॥

తా॥ సూర్య సంచారమునే నిరోధించినట్టి, హనుమంతుడను పర్వతమునకు కప్పువలె నుండి విశ్రాంతి నిడిన ఆ హనుమంతుని తోకను ఛేదించుటకై గరుత్మంతుడు తలపోసెను.

శ్లో॥ వివేధ వాలధిం తస్య తుండాగ్రేణ గరీయసా ।
హనునీ ఇవ దేవేంద్రో వజ్రేణ శతకోటినా॥

తా॥ అంతట పెద్దదగు తన ముక్కు కొనతో దేవేంద్రుడు వజ్రాయుధముతో హనువులను వేధించినట్లుగా గరుడుడు తోకను పొడువసాగెను.

శ్లో॥ పక్షితుండాగ్రభిద్దండః విపక్ష బల మర్దనః ।
చుకోప హనుమాన్ తార్క్ష్యే త్రిపురే ష్వివ శంకరః ॥

తా॥ గరుడుని ముక్కు పోట్లచే పొడువబడినవాడై శత్రునాశకుడగు హనుమంతుడు శంకరుడు త్రిపురాసురుని యందు కోపమందినట్లు గరుత్మంతునిపై కోపగించెను.

శ్లో॥ తతో వాలాగ్ర లగ్నాంగం బబంధాండమి వాంపజం
ప్రచేతః పాశ సంకాశైః మారుతి స్తస్య లోమభిః॥

తా. పిమ్మట తోకచివరనున్న గరుత్మంతుని వరుణుని పాశముతో సమానమైన రోమములతో హనుమంతుడు గ్రుడ్డును పట్టినట్లు పట్టి బంధించివైచెను.

శ్లో. దృఢబంధ నిరుచ్ఛ్వాసం యంత్రోపల సమన్వితం।
ద్విగుణీకృత వాతేన క్షిప్తవా నివ యంత్రతః॥

తా. గట్టిగా బంధించుటచే శ్వాసక్రియ జరుగనట్టి, యంత్రశిలవంటి గరుత్మంతుని రెట్టింపు వేగముతో విసరినట్లు విసరెను.

శ్లో॥ వాలభగ్న స్సర్వాంగః కాలాంతకవశం గతః।
వాలక్షేపా దనిర్వార్య శ్వేతద్వీపే పపాత సః॥

తా॥ తోకచే చితుకకొట్టబడిన అవయవములు కల వాడై యమునకు చిక్కినట్లు కాక తోకతో విసరుటచే ఆపశక్యముకానివాడై గరుత్మంతుడు శ్వేతద్వీపమునందు పడెను.

శ్లో॥ స భగ్నపక్ష మూలాగ్రః భగ్నః గుహ్యాంగ సంహతిః।
భగ్న తుండాగ్ర దండాంతః మగ్న క్షీరార్ణవే పయః।

తా॥ ఆతడు విరిగిన రెక్కల మొదళ్ళు కల్గి, గుహ్యాంగములు దెబ్బతిని, చితికిన ముక్కు కొనలు కల వాడై పాలసముద్రమునందు పడి మునిగెను.

శ్లో॥ అథ క్షీరోద సంస్పర్శాత్ పున రుద్బద్ధ పక్షతిః।
విశ్రామ్యనామ తత్తీరే జగామ ద్వారకాం పురీం॥

తా॥ పిమ్మట క్షీరసముద్ర జలస్పర్శచే మరల మొలచిన రెక్కలు కలవాడై పాలసముద్రపు టొడ్డున కొంత సమయము విశ్రమించి ద్వారకానగరమునకు వెడలెను.

శ్లో. నిర్విణ్ణవదన స్తార్క్ష్యః విసృష్ట బలదర్పకః
లజ్జాభర సమాయుక్తః శ్రీకృష్ణం సందదర్శహ॥

తా. గరుత్మంతుడు వాడిపోయిన ముఖముకల్గి బల గర్వ మణగినవాడై సిగ్గునందినవాడై శ్రీకృష్ణుని చూచెను.

శ్లో॥ లజ్జావనత చూడాగ్రం పురత స్సంస్థితం హరిః
ఇత్యువాచ వచ స్స్వాదు నిగూఢ విశద స్మితః ॥

తా. సిగ్గుచే తలవంచి ఎదుటనున్న గరుత్మంతునితో దాగియు స్పష్టమగు చిరునగవుకల శ్రీకృష్ణుడు తీయగా నిట్లు పల్కెను—

శ్లో॥ కథం తిష్ఠసే ఖగశ్రేష్ఠ నిర్విణ్ణ ఇవ దృశ్యసే
నానీతోఽపి కపిశ్రేష్ఠః విలంబః కేన హేతునా ॥

తా. ఓ పక్షీంద్రా! అట్లు నిలుచుంటివేల? నిర్విణ్ణుడవై యున్న కారణ మేమి? హనుమంతునికూడ తీసికొని రాలేదు. ఏ కారణముచేత ఇంత ఆలస్యమైనది?

శ్లో॥ న దృష్టోఽప్యథవా స్వేన సంచరన్ కపిభావతః
త న్మమాచక్ష్వ వృత్తాంతం పృచ్ఛత స్తత్త్వతః ఖగ॥

తా. ఆతడు వానర స్వభావముచే తిరుగుచుండుటవలన నీకు కనపడలేదా యేమి? ఓ గరుత్మంతా! ఈ అడుగుచున్న నాకు వృత్తాంత మంతను చెప్పవలసినది.

శ్లో॥ తతః ప్రాహ హరిం తార్క్ష్యో హ్రియాఽవనత కంధరః

తా. అనగా నంతట గరుత్మంతుడు సిగ్గుచే తల వంచినవాడై శ్రీకృష్ణునితో నిట్లనెను—

శ్లో॥ దేవదేవ! జగన్నాథ! పురాణపురుషోత్తమ!
త్వన్మాయయా జగత్సర్వం మోహితం స చరాచరం॥

తా. ఓ దేవదేవా! జగన్నాయకా! పురాణపురుషులలో నుత్తముఁడైనవాఁడా! నీ మాయవలన చరాచర జగత్తంతయు మోహమందియుండును.

శ్లో॥ ఇతో గత్వాఽహ మత్యర్థం సగర్వ బలపౌరుషః
గంధమాదన మద్రాక్షం గిరిం సౌరభబృంహితం
తత్రాపశ్యం హనూమన్తం నిశ్చలం యోగనిష్ఠయా॥

తా. ఇటుగా వెడలి మిక్కిలి బలగర్వముతో నున్న నేను సువాసనల పెల్లుగల గంధమాదన పర్వతమును చూచితిని. అచ్చట నిశ్చలుడై యోగనిష్ఠలోనున్న హనుమంతుని చూచితిని.

శ్లో॥ తత స్సమీప మగమం వ్యవధి వ్యర్థ సంభ్రమః
ఆశ్రావయ మథాఽహం తు భవదాజ్ఞాం గరీయసీమ్॥

తా. పిమ్మట ఆలస్యమగునని తొట్రుపాటుతో సమీపమునకు వెళ్ళి నేను గొప్పదగు నీ ఆజ్ఞను వినిపించితిని.

శ్లో॥ తథాఽపి నాశ్రుణోద్దేశ స్తామనన్యరథా రతిః॥

తా. అయినను అన్యచింతనమున నిష్టములేని యాతడు నా మాటను వినలేదు.

శ్లో॥ గారుడం వచనం శ్రుత్వా ముఖాకోపిత విస్మయః
ఉవాచ విస్తరం వాక్యం హరి ర్భక్తపరాయణః॥

తా. అనగా గరుత్మంతుని మాటలు విని ముఖమున నాశ్చర్యభావము స్పష్టముకాగా భక్తులయందు దయకల శ్రీకృష్ణుడు గద్గదకతతో నిట్లు పల్కెను-

శ్లో॥ కి మిదం క్రియతే జాప్యం ధి క్ప్రమండసమే క్షణం
సమాహ్వాయ హనూమంతం అస్తి తేన ప్రయోజనమ్॥

తా. ఛీ ! నియమ రహిత జపమువలె నున్నది. వెంటనే హనుమంతుని తీసికొనిరమ్ము. ఆతని వలన పని యున్నది.

శ్లో॥ ఇతి కృష్ణేన సందిష్టః భీతః కపి మనుస్మరన్
వచనం కరుణం ప్రాహ గరుత్మా న్నమ్రకంధరః॥

తా. అని కృష్ణునిచే ఆదేశింపబడినవాడై భయ కంపితుడై హనుమంతుని స్మరించుచు గరుత్మంతుడు తల వంచి దీనముగా నిట్లు పల్కెను-

శ్లో॥ అస్వాభావి మయా యచ్చ చాపలం కర్మ కుర్వతా
దుర్వచో భగవన్ దేవ నోక్తం హి జన్మజన్మని॥

తా॥ ఓ భగవానుడా ! దేవదేవా ! తగనటువంటి చపలకృత్యము చేసిన నేను జన్మజన్మలకు అబద్ధమాడరాదు.

శ్లో॥ సర్వజ్ఞేన త్వయా దేవ ! మద్గర్వ హరణాయ చ
నూనం కృత్యే రేషః కృతో మానా కపిరూపధరో మమ॥

తా॥ దేవా ! నా గర్వము నణచుటకై సర్వజ్ఞుఁడ వైన నీచే నా పాలిటి మృత్యువు వానర రూపముతో నిర్మింపబడినాడు. ఇది నిశ్చయము.

శ్లో॥ యస్యాం మాస్తే దిశి ప్రాజ్ఞ ఉదాసీనోపి మారుతిః
తస్యై నమ స్త్రిసంధ్యం నై కుర్యాం ముక్తేతర క్రియాః॥

తా॥ ప్రాజ్ఞుఁడగు హనుమంతుడు ఊరకే అయిన ఏ దిక్కున ఉండునో ఆ దిక్కునకు త్రిసంధ్యలందును నమస్కారము ఆ పని తప్ప ఇతరమైన దేదయిన చెప్పుము చేసెదను

శ్లో॥ అథ చాజ్ఞాపయ స్వామిన్ కర్తవ్య మపరం మమ
అయథాబల మారంభః వినాశః క్షయసంపదః॥

తా॥ ఆ పని కాక ఓ దేవా! ఇంక ఏదైన పనికి నన్నాజ్ఞాపింపుము చేసెదను. శక్తికి మించినపని నారంభించుట వినాశ హేతువు సంపత్ క్షయకరముకూడ కదా !

శ్లో॥ ఇతి శ్రుత్వా వచ స్తస్య ప్రహస న్యదునందనః
జగాద వచనం న్యాయ్యం మర్మోద్ఘాటన తత్పరమ్॥

తా॥ అని గరుత్మంతుడు చెప్పిన మాటను విని శ్రీకృష్ణుడు నవ్వుచు న్యాయమగునట్టి, మర్మమున నాటునట్టి మాట నిట్లు పల్కెను-

శ్లో॥ బ్రవీషి కి మిదం శూర ! పురైవం నాభిభాషసే।
నయుక్తం తవ పక్షీశ ? ప్రాకృతస్యేవ వైకృతమ్॥

తా॥ ఓయి పరాక్రమశాలీ ! ఇట్లు పలుకుచున్నా వేమి ? పూర్వమెన్నడు నిట్లు పల్కలేదు. ఓ ఖగ కులో త్తమా, ప్రకృతి విరుద్ధమగు నీ భాషణము నీకు తగదు.

శ్లో॥ విక్రమస్య తవ క్వాపి ప్రతిఘాతో న విద్యతే
స తు శాఖామృగో హంత కోఽపి వన్యఫలాశనః॥

తా॥ నీ పరాక్రమమున కెచ్చటను అడ్డు ఉండదు. అయ్యో ! అతడు కేవలం వనములందలి పండ్లు తిని కొమ్మలపై సంచరించు కోతియే కదా !

శ్లో॥ అపహాయ పరీహాసం గమ్యతా మేష నీయతాం
అస్తి ప్రయోజనం తేన విలంబం మా కృథా వృథా॥

తా॥ పరిహాసము వీడుము. వెంటనే వెళ్ళి ఆతనిని తీసికొని రమ్ము. ఆతనితో పనియున్నది. వ్యర్థముగా ఆలశ్యము చేయకుము.

శ్లో॥ గ త్వేదానీం హనూమంతం రామనామానువర్ణయా
కపే ! భవంత మాహూతే సీతారామో మహా నితి॥

తా॥ ఇప్పుడు రామనామము నొనర్చుచు హనుమంతుని కడకు వెళ్ళి 'వానరా! నిన్ను మహామహుడు సీతారాముడు పిలుచుచున్నాడు' అని చెప్పుము.

శ్లో॥ ఏవం వదతి గోవిందే స ప్రత్యాఖ్యాన కాతరః
తథేతి ప్రతి జగ్రాహ ప్రాణే ష్వాస్థాం విహాయ వై ॥

తా॥ ఇట్లు కృష్ణుడు పలుకగా ఎదురు సమాధా

నము చెప్పుటకు భయమంది అట్లే అని చెప్పి ప్రాణములం దాశ వదులుకొనియే-

శ్లో॥ జగామ తత్ర వేగేన గంధమాదన పర్వతం
యథాపూర్వం దదర్శైష తత్ర శాఖామృగోత్తమమ్॥

తా॥ వేగముగా గంధమాదన పర్వతమునకు వెడలెను. గరుత్మంతుడు పూర్వమువలెనే అచ్చట వానర శ్రేష్ఠుడగు హనుమంతుని చూచెను.

శ్లో॥ ప్రాంజలిః ప్రణతో భూత్వా మందాక్షర మువాచ సః
కపే! భవంత మాహూతే సీతారామో మహానితి॥

తా॥ అంజలి ఘటించి నమస్కరించినవాడై నెమ్మదిగా గరుత్మంతు డిట్లు పల్కెను. 'ఓ వానరా! మహానుభావుడగు సీతారాముడు నిన్ను పిలుచుచున్నాడు'

శ్లో॥ ఉద్బుద్ధ నయన స్సద్యః హస్తాకృష్ట ఇవ త్వరన్
అసమాప్యాపి యోగాంత మువాచ కపిశేఖరః॥

తా॥ వెంటనే హనుమంతుడు కన్నులు తెఱచి చేయి పట్టి లాగినటుల తొందరపడుచు యోగము పూర్తి కాకున్నను ఇట్లు పల్కెను-

శ్లో॥ధన్యోఽస్మి కృతకృత్యోఽస్మి మహాభాగ్యోఽస్మి యత్త్వయా
సుఖంమే ప్రాపితం శ్రోత్రం రామనామకథాఽమృతాత్

తా॥ నేను ధన్యుడనైతిని, కృతకృత్యుడనైతిని.

నీ వలన మహాభాగ్య మందితిని. రామనామ స్మరణమను అమృతము వలన నా చెవులకు సుఖము చేకూరినది.

శ్లో॥ ఇద మర్ఘ్య మిదం పాద్యం అయం పుష్పాంజలి స్తవ
ఫలా నీమాని గృహ్ణీష్వ మధురాణి ఖగేశ్వర !॥

తా॥ ఇదిగో నీకు అర్ఘ్యము. ఇదే పాద్యము. నీకు పుష్పాంజలి సమర్పించుచున్నాను. ఓ ఖగరాజా ! ఇవిగో మధురములైన ఫలములు. స్వీకరింపుము.

శ్లో॥ యథా మే రాఘవః పూజ్యః జాగ్ర త్స్వప్న సుషుప్తిషు
తథాచాపి సమర్చ్య స్త్వం రామనామ పరాయణః॥

తా॥ ఏ విధముగా నాకు జాగ్రదవస్థ, సుషుప్త్యవస్థ, స్వప్నావస్థ అను మూడవస్థలయందు శ్రీరామచంద్రుడు పూజ్యుడో అట్లే రామనామ పరాయణుడవగు నీవును నాకు అర్చనీయుడవు

శ్లో॥ సందర్శయ సఖే ! రామం గచ్ఛ యత్రాస్తి రాఘవః
ఆరోహ త్వం మమస్కంధ మథవా ఽహ మనువ్రజః॥

తా॥ ఓ స్నేహితుడా ! రాముని చూపుము. రాఘవు డెక్కడున్నాడో అక్కడకు వెళ్ళెదము. నీవు నా భుజముల నెక్కుము. లేదా ! నేను నిన్ననుసరింతును నడువుము.

శ్లో॥ ఏవం వదతి సంప్రీత్యా వాయుపుత్రే మహాత్మని
త త్స్కంధారోహణా ద్భీతః ప్రయాతః పురతః ఖగః

తా॥ ఇట్లు మిక్కిలి ఆనందముతో మహానుభావు

డగు హనుమంతుడు పలుకగా ఆతని భుజము లెక్కుటకు భయమందినవాడై గరుత్మంతుడు ముందు నడచెను.

శ్లో॥ గంతవ్య వర్త్మా ప్రణయా త్కపీంద్రో
హ్యారత్ని మాత్రం తమను ప్రయాతః
నచే త్పురస్తాత్ ప్రతిరంహనకాలే
ముహూర్త గమ్యం సరణిం క్షణాద్గతః॥

తా॥ వెళ్ళవలసిన మార్గమున నిష్టము కలవాడగుట వలన హనుమంతుడు మూరెడు దూరములోనే గరుత్మంతు ననుసరించి పోజొచ్చెను. ఎదురులేని కారణమున త్రుటిలో వెడలు వేగముతో వెంటనే చేరెను.

శ్లో॥ ఆయాంత మారా దుదయాద్రిశోభం
కృతాంజలిం రామ మనుస్మరన్తం
పురస్సర స్వర్ణ పతత్రి బింబం
నిరీక్ష్య కృష్ణో రఘురామ తాం యయౌ॥

తా. సమీపించునటువంటి, ఉదయాద్రిశోభ కల్గి యున్నట్టి, అంజలి ఘటించి రాముని స్మరించుచు నున్నటు వంటి, ముందు సువర్ణపర్ణుడగు గరుత్మంతుని కల్గియున్నట్టి హనుమంతునిచూచి కృష్ణుడు రఘురామునిగా మారెను.

శ్లో॥ సత్యభామాం తతో వీక్ష్య వచనం చేద మబ్రవీత్
రామోఽహ మానవం దేవి! త్వం సీతా త్వం వహ స్మృతమ్॥

తా. పిమ్మట ఆతడు సత్యభామను చూచి ఇ...

పల్కెను- 'ఓ దేవీ ! నేను రాముని గానయితి. నీవు వెంటనే సీతవు కమ్ము'.

శ్లో॥ శ్రీకృష్ణ వచనం శ్రుత్వా చేత్థం సత్యాఽకరోద్యతి
నాగమజ్జానకీరూపం దృష్ట్వా కృష్ణోఽవద ద్వచః ॥

తా. అనగా శ్రీకృష్ణుని మాట విని అట్లే సత్యభామ యత్నించెను. కాని జానకీరూపము నందలేదు. అప్పుడామెను చూచి కృష్ణు డిట్లు పల్కెను-

శ్లో॥ త్వరితం కురు సీతాను వేష మేషః కపీశ్వరః
నోచే ద్భవే ద్గర్వభంగః అస్మాక మపి మానిని॥

తా. ఇదే! హనుమంతుడు వచ్చుచున్నాడు. త్వరగా సీతాస్వరూపము నందుము. లేకున్న ఓ మానినీ ! మనకు కూడ గర్వభంగము కాగలదు.

శ్లో॥ సత్యభామా విచింత్యాత్మ న్యద్య కస్త్ర మిదం కథం?
శ్రీకృష్ణో మాం పరీక్షార్థ మిత్థం సంకల్ప్య బాధతే॥

తా. సత్యభామ తనలో నాలోచించి ఇప్పుడు సీతారూప మందు టెట్లు? శ్రీకృష్ణుడు నన్ను పరీక్షించుటకే సంకల్పించి ఇట్లు బాధించు చున్నాడు.

శ్లో॥ రుక్మిణీ కథ మప్యేత త్కర్తుం నార్హతి సర్వథా
ఇతి నిశ్చిత్య కృష్ణాయ సద్యో వచన మబ్రవీత్॥

తా. రుక్మిణి కూడ జానకీరూపమందుట కెట్లును

సమర్థురాలు కాదు. అని నిశ్చయించుకొని వెంటనే కృష్ణు నితో నిట్లు పల్కెను-

శ్లో॥ రుక్మిణ్యాం తవ చేత్ ప్రతి స్తయా కారయితుం వరం
న యుక్తోఽహ మిదం కర్తు మిదానీం యదునందన!

తా. ఓ హరీ ! నీకు రుక్మిణియందు ప్రీతి యున్నచో ఆమెచే నీపని చేయించుట శ్రేయము. ఇప్పు డీ పని నేను చేయజాలను.

శ్లో॥ ఇత్యాకర్ణ్యావద త్కృష్ణః సత్యాయ ద్రుతమానసః
ఏష ఆగచ్ఛతి కపిః తవచే న్నాస్తి ధీరతా
రుక్మిణీ మపి వా సద్యః కర్తు మాజ్ఞాపయా మ్యహం॥

తా. అను సత్యభామ వాక్యము విని వేగిరపడు మన స్సుతో నామెతో నిట్లనెను- 'ఇదే! హనుమంతుడు వచ్చు చున్నాడు. జానకీరూపము దాల్చు ధీరత నీకు లేకున్నచో వెంటనే రుక్మిణి నయినా ఈ పని చేయుటకై ఆజ్ఞాపింతును'.

శ్లో॥ ఇత్యుక్తవంతం శ్రీకృష్ణం లజ్జాఽవనత శీర్షికా
సత్యభామాఽవద న్నానగ రుక్మిణ్యాపి చరే త్కథం?
మయాఽకృతాం క్రియాం కర్తుం నై తస్యాపి యోగ్యతా।

తా. అని పల్కు శ్రీకృష్ణునితో సిగ్గున వంచిన తల గలదై సత్యభామ పల్కెను. ఈ కార్యము రుక్మిణి మాత్ర

మెట్లు ఆచరించగలదు ? నేను చేయలేనిపని చేయుటలో ఆమెయు యోగ్యురాలు కాదు.

శ్లో॥ శ్రీకృష్ణః రుక్మిణీం వీక్ష్య కర్తు మాజ్ఞాం ప్రయచ్ఛతి
నాచే ద్భవే ద్గర్వభంగః అస్మాక మపి మానిని !॥

తా॥ శ్రీకృష్ణుడు రుక్మిణిని చూచి ఆజ్ఞాపించెను. అట్లాచరించకున్న ఓ మానినీ! మనకును గర్వభంగము కు నని పల్కెను.

శ్లో॥ రుక్మిణ్యభూ ద్రుక్మ మనోజ్ఞ భూషణా
విదేహపుత్రీ సహధర్మచారిణీ
పురీపుర ద్వారవతీ తదానీం
హ్యాసీ దయోధ్యా రఘురాజ్యధానీ॥

తా. అంత మనోహరములగు భూషణములతో రుక్మిణి సహధర్మచారిణియగు జానకీమహాదేవి యయ్యెను. ద్వారకా పట్టణము రఘురాముని రాజధానియగు అయోధ్యా నగర మయ్యెను.

శ్లో॥ తత్ర సింహాసనాసీనం సీతయాసహ రాఘవం
ననామ హనుమాన్ భక్త్యా ప్రదక్షిణ పురస్సరమ్॥

తా. అట సీతతోకూడి సింహాసనము నధిష్ఠించియున్న రాముని చూచి హనుమంతుడు భక్తితో ప్రదక్షిణ నమస్కారము లొనర్చెను.

శ్లో॥ ఉత్థాయ ప్రాంజలి ర్భూత్వా పరమానంద నిర్భరః
తుష్టావ స్తోత్రభావైశ్చ వేదాంతై ర్యార్థబృంహితైః॥

తా. పిమ్మట నిలచి అంజలి ఘటించి పరమానంద మందినవాడై వేదాంత పూర్ణములగు స్తోత్రములతో కీర్తించెను.

శ్లో॥ జగౌ రామకథాం శ్రావ్యా దానందాశ్రుకళః కపిః
ననర్త నృత్యశాస్త్రజ్ఞః సర్వాన్ విస్మారయన్ సభామ్॥

తా. ఆనందాశ్రువులు నిండినవాడై హనుమంతుడు శ్రావ్యమగు రామకథను పాడెను. నృత్యశాస్త్రజ్ఞుడగు నాతడు సభసదులు మైమరచునట్లు నాట్యమొనర్చెను.

శ్లో॥ తతః కుశల మాపృష్టో రఘునాథేన ధీమతా
సర్వత్ర కుశలం ప్రాహ వినయాఽవనతః కపిః॥

తా. పిమ్మట ధీమంతుడగు శ్రీరామచంద్రుడు కుశల ప్రశ్నలు వేయగా వినయముచే నమ్రుడై హనుమంతుడు అంతట కుశలముగ నున్నట్లు చెప్పెను.

శ్లో॥ త్వయి త్రాతరి భక్తానాం నాశుభం విద్యతే క్వచిత్
అధిరోహతి పూర్వాద్రిం భాస్కరే తిమిరః కుతః॥

తా. భక్తులపాలిటి రక్షకుడవైన నీవు రక్షించుచుండ నెచ్చటను అశుభము లుండవు. సూర్యుడు తూర్పు కొండపైకి రాగా ఇక చీకటి ఎట్లుండును ?

శ్లో॥ ఇత్యావేదితభక్తిం త మబ్రవీ ద్రఘునందనః

తా. ఇట్లు తెలియజేయబడిన భక్తికల హనుమంతు నితో రాము డిట్లనెను-

శ్లో॥ ఉపపన్న మిదం సర్వం త్వయి భక్తశిరోమణౌ
త్వత్ప్రమాణా వయం సర్వే మానం దృష్టం తత స్తతః॥

తా. ఓ హనుమంతా ! భక్తులలో శ్రేష్ఠుడవగు నీ యందే యోగ్యలక్షణమంతయు నుపపన్నమై యున్నది. మేము నీ ప్రమాణముననే యున్నాము. మున్ముందు లోకము మమ్ము నీవలననే తెలియగలదు.

శ్లో॥ ఏకః ప్రాణ శ్శరీరే ఽస్మిన్ సీతాయాం ద్విస్త్రయోఽనుజే
చత్వార స్త్వ ఇమే ప్రాణాః తస్మా త్సర్వప్రియో భవాన్॥

తా. ఈ శరీరమున నొక ప్రాణ మున్నది. సీతయే నా రెండవప్రాణము. లక్ష్మణునియందు మూడవ ప్రాణమున్నది నాల్గవప్రాణము నీవే. ఇట్లు నీవు అందరికంటె నిష్టుడవు.

శ్లో॥ ఇత ఏహి కపిశ్రేష్ఠ ! గృహాణేమాం మణిస్రజం
స్కంధే ధారయ మాలాం త్వై నోపేక్ష్యోహి కదాచన॥

తా. ఓ వానరశ్రేష్ఠా ! ఇటురమ్ము. ఈ మణిహార మును తీసికొనుము. దీనిని మెడలో ధరించుము. ఎప్పు డును దీని నుపేక్షించవలదు.

శ్లో॥ శ్రాంతోఽసి హనుమన్ నూన మాయతో దూరవర్త్మనా
గచ్ఛ శీఘ్ర మితో దేశాత్ సురభిం గంధమాదనమ్॥

తా. ఓ హనుమంతా నీవు దూరమునుండి వచ్చుట వలన అలసియుంటివి. వెంటనే ఇటనుండి పరిమళ భరిత మగు గంధమాదన పర్వతమునకు వెడలుము.

శ్లో॥ ఇద మాజ్ఞావచో మాలాం శిరసా ధారయ త్కపిః
పునః ప్రదక్షిణీకృత్య ప్రణనామ రఘూత్తమమ్॥

తా. హనుమంతుఁడా ఆజ్ఞావాక్యమును, మాలికను శిరసావహించి మరల ప్రదక్షిణ మొనర్చి రఘురామునకు నమస్కరించెను.

శ్లో॥ ఇత్థం గిరీశ తనయోఽనుమతో విదేహ
పుత్రీ ప్రియేణ నిజసోదర సంయుతేన
కృష్ణస్య రాఘవతయాపి స విస్మయేన
తార్క్ష్యో హి సన్నుతపద స్స్వపదం జగామ॥

తా॥ ఇట్లు జానకీపతియు, సోదరసహితుడు నగు శ్రీరాముని అనుమతితో హనుమంతుడు తన స్థానమగు గంధ మాదనమునకు వెడలెను. కృష్ణుని ఆజ్ఞచే గరుత్మంతుడును ఆశ్చర్యమగున్న డగుచు తన స్థానమునకు వెడలెను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
పరాశర మైత్రేయ సంవాదే
గరుడ గర్వాపహరణం నామ అష్టచత్వారింశత్పటలః

—: సమాప్తః :—

# ఏకోనపంచాశత్పటలః

## హనుమత్పూజా సాధన ప్రకాశ కథనం

శ్రీ మైత్రేయః :—

శ్లో॥ పరాశర ! మహాప్రాజ్ఞ ! సర్వాగమ విశారద !
పూజార్థం శ్రీ హనూమంతం పత్ర పుష్ప ఫలాని చ
యాని యోగ్యాని పుష్పాణి తాని మే వక్తుమర్హసి॥

తా. శ్రీ మైత్రేయు లడుగుచున్నారు. గొప్ప జ్ఞాన సంపద కలవాడా ! సర్వాగమములను బాగుగా తెలిసిన వాడా ! ఓ పరాశర మహాముని ! శ్రీ హనుమంతుని పూజ కొరకు ఏ ఆకులు, ఏ పూవులు, ఏ ఫలములు తగినవి ? పుష్పములందు హనుమత్పూజకు యోగ్యములయిన వానిని నాకు చెప్పవలసినది.

శ్రీ పరాశరః :—

శ్లో॥ కుంద పాటల పున్నాగ కేతకీ వకుళాని చ
నంద్యావర్త జపా నీప లికుచా బ్జోత్పలా న్యపి॥

తా. శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు— ఓ మైత్రేయా ! హనుమంతుని పూజకు అర్హములగునవి వినుము— మొల్లలు, కలిగొట్టుపూలు, పున్నాగపూలు,

మొగలిపూలు, పొగడపూలు, నందివర్ధనపూలు, దాసాని పూలును. కదంబము, గజనిమ్మ, తామర, కలువ మొదలగు నవి తగినవి. ఇంకను-

శ్లో॥ కరవీరాణి జాతీశ్చ మల్లికా చంపకాని చ
మందార పారిజాతాని పలాశ కుసుమాని చ॥

తా. ఎఱ్ఱగన్నేరు, జాజి, మల్లెలు, సంపెంగపూలు, మందారపూలు, పారిజాతములు, మోదుగపూలును-

శ్లో॥ కనకాంబరపుష్పాణి ద్రోణా న్యపి తథైవ చ
నీలాంబరాణి భవ్యాని కుటజాని శుభా న్యపి॥

తా. కనకాంబరములు, తుమ్మిపూలు, నీలాంబరములు, కొడిసెపూలు అర్పింపదగినవి. ఇంకను-

శ్లో॥ కురంట స్థలపద్మాని కేసరాసన మాధవీః
వనమల్లీ కర్ణికారం కుబ్జార్కే చంద్రకాంతకమ్॥

తా. పచ్చగోరింట, మెట్టతామర, సుర పొన్న, వేఁగిసపూలు, పూల గురువింద, అడవి మల్లెలు, కొండ గోఁగు, పొట్ల, జిల్లేడు, చంద్రకాంతపూలు-

శ్లో॥ సురపున్నాగ కౌసుంభ కకుభాష్టాపదా న్యపి
సీమంతినీ సుపుష్పాణి హరిద్రా న్యక్షతా న్యపి॥

తా. సురపొన్నపూలు, కుసుమపూలు, మద్దిపూలు, బంగరుపూలు, సీమంతినీ పుష్పములును తగిన పుష్పములు. పసుపు అక్షతలును-

శ్లో॥ తిలాక్షతాన్ శ్వేతవర్ణాన్ శాలీయా నవ్రణా నపి
బిల్వామలక దూర్వా శ్చ అరవిందవనం తథా॥

తా. తెల్లనువ్వుల అక్షతలు, విరుగని శాలిధాన్యపు అక్షతలు అక్షతలందు యోగ్యములు. పత్రములందు మారేడు, ఉసిరి, గరిక, తామర ఆకులును, అట్లే-

శ్లో॥ సిందువార శమీ చూత జంబూ రుద్రజటా అపి
తులసీ మాచిపత్రం చ వటపత్రం తథైవ చ
గౌరీజటా మపామార్గం పూజయే చ్ఛ్రీ హనూమతః॥

తా. వావిలి, జమ్మి, మామిడి, నేరేడు, రుద్రజట, తులసి, మాచిపత్రము, మర్రి ఆకులును, గౌరిజట, ఉత్తరేణి పత్రములతో శ్రీ హనుమంతుని పూజించవలెను.

శ్లో॥ కదళీ చూత జంబీర పనసా ఽమ్ల ఫలాని చ
కపిత్థ జంబూ ఖర్జూర బదరీ దాడిమా న్యపి॥

తా. అరటి, మామిడి, నిమ్మ, పనస, చింత, వెలగ, నేరేడు, ఖర్జూర, రేగు, దానిమ్మపండును సమర్పింపదగును. ఇంకనూ-

శ్లో॥ సీతాఫలం మహాస్వాదు ముర్వారుకఫలం తథా
ద్రాక్షాఫలం చేక్షుఖండం నారికేలం తథైవచ॥

తా. సీతాఫలము, మంచిరుచికల్గు దోసపండు, ద్రాక్ష పండు, చెఱకు ముక్కలు, కొబ్బరికాయ.

శ్లో॥ పనసాదీని పక్వాని ఫలాని మధురాణి చ
సమర్పయేత్ కపీశాయ ప్రత్యహం మునిసత్తమ॥

తా. మొదలగు వానిని మంచి పాకమునకు వచ్చి మధురముగ నుండు వానినే ఓ మైత్రేయా ! ప్రతి దినము శ్రీ హనుమంతునకు సమర్పించవలెను.

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి శ్రుణు మైత్రేయ! తత్వతః॥

తా. ఓ మైత్రేయా ! హనుమంతునకు సంబంధించిన వేఱొక విశేషమును చెప్పుచున్నాను. నిశ్చల బుద్ధితో వినవలసినది.

శ్లో॥ కదలీవన మధ్యస్థం పూజయేద్యః కపీశ్వరమ్
తస్య పుణ్యఫలం ప్రోక్తం గుణితం కోటిసంఖ్యయా॥

తా. అరటితోట మధ్యన ఉన్న శ్రీ హనుమంతుని ఎవరు పూజింతురో వారికి పూజాఫలము కోటిరెట్లు పుణ్యముగా లభించును.

శ్లో॥ హనుమద్విషయం యంత్రం హృదయం కవచమేవ వా
సిద్ధ్యంతి సర్వకార్యాణి జపతః కదలీవనే॥

తా॥ హనుమద్విషయము యంత్రమైనను, హృదయమైనను, హనుమత్కవచమైనను కదలీవనమందు జపించుటవలన సర్వకార్యములు సిద్ధించును.

11)

శ్లో|| ఆవర్తయన్ త్రివారంతు కదళీవన మధ్యగః
అన్యత్ర శత సాహస్ర కోట్యావృత్తిఫలం లభేత్ ||

తా|| అరటి తోట మధ్యనుండి మూలమంత్రమును హనుమన్మంత్రము నావృత్తి చేసినవాడు ఇతరచోట్ల వందల, వేల, కోట్లసార్లు ఆవృత్తి చేసిన ఫలితమును పొందును.

శ్లో|| రంభావనాంతరే రమ్యే హనుమత్ప్రీతయే పుమాన్
కించిత్సువర్ణం రౌప్యం వా దద్యాచ్చే దమితంఫలమ్||

తా|| రమ్యమగు కదళీవన మధ్యభాగమున హనుమత్ప్రీతికొఱకై ఎవఁడు కొద్దిమాత్రము బంగారముగాని వెండిగాని ఇచ్చునో దానివలన వాఁ డమితమగు ఫలితమును పొందును.

శ్లో|| ఏవం విధం ప్రకుర్వంతః మునయ స్సిద్ధి మాగతాః

తా|| ఈ విధముగనే ఆచరించి మునులు మంత్రసిద్ధి నందిరి.

శ్లో|| సంపూజ్య కదళీమధ్యే ధృవోఽపి ధృవనిశ్చయః
అంజనాసుత మభ్యర్చ్య ధృవం పద మవాప సః||

తా ధృవుఁడు కూడ నిశ్చయ మనస్కుఁడై అరటి తోటయందు అంజనా తనయుఁడగు హనుమంతుని పూజించి ధృవపదము నందగలైను.

శ్లో॥ సప్తర్షయో మునిశ్రేష్ఠాః కదళ్యాం కపినాయకం
సంపూజ్య విధివత్పుష్పైః సంప్రాప్తా శ్శాశ్వతం పదమ్॥

తా. మునిశ్రేష్ఠులగు సప్త మహర్షులును, అరటి తోటయందు వానర నాయకుఁడగు హనుమంతుని యథా విధిగ పుష్పములతో పూజించి శాశ్వతమగు స్థానమును సంపాదించిరి. అనగా సప్తర్షి మండలమున స్థిరులైరి. సప్తర్షులనఁగా ప్రస్తుత వైవస్వత మనువు కాలమునకు సంబంధించినవారు- 1. వశిష్ఠుడు 2. అత్రి. 3. గౌతముఁడు. 4. కశ్యపుడు. 5 భరద్వాజుడు. 6 జమదగ్ని. 7. విశ్వామిత్రుఁడు వీరు ఆయా మన్వంతరములందు మారుచుందురు.

శ్లో॥ మార్గశీర్షే మహామాసే మందవారే శుభావహే
రంభావనే మహారమ్యే బ్రాహ్మణాన్ భోజయేద్యది॥

తా. గొప్ప మాసమగు మార్గశీర్షమందు శుభప్రద మగు శనివారమున మిక్కిలి రమ్యమగు కదళీ వనమందు బ్రాహ్మణులకు భోజనము పెట్టినయెడల-

శ్లో॥ తస్య ప్రసన్నో హనుమాన్ సర్వ కామ ఫలప్రదః
దదాతి శాశ్వతీ భక్తిం సర్వత్ర చ పరాంగతిమ్॥

తా. వానికి సమస్తములగు కోర్కెలను తీర్చువాఁడై హనుమంతుఁడు ప్రసన్నుఁడై తనయందు శాశ్వతభక్తిని, అంతటను ఉత్తమమగు స్థితిని అనుగ్రహించును.

'మాసానాం మార్గశీర్షోఽహం' అని శ్రీకృష్ణభగవా

నుడు భగవద్గీతయందు చెప్పియుండుట మార్గశీర్ష మాసపు విశిష్టతకు తార్కాణము. శనివారము హనుమంతుడు పుట్టినరోజు అగుట విశేషము.

శ్లో॥ అపూపాని సుపుష్పాణి తాంబూలాని ఫలానిచ
హనుమత్ప్రీభవే నిత్యం అర్చయే త్పంచసంఖ్యయా॥

తా. అప్పములను, పుష్పములను, తాంబూలము లను, పండ్లను హనుమత్ప్రీభువుయొక్క అర్చనకై ఐదు సంఖ్యలో ప్రతి నిత్యము వినియోగించవలెను.

శ్లో॥ బహునాత్ర కిముక్తేన దీయతే బ్రాహ్మణాయచ
హనుమ త్ప్రీతిలాభాయ తద్దేయం పంచసంఖ్యయా॥

తా. ఇంత ఎక్కువగా చెప్పనేల ? బ్రాహ్మణున కైనను హనుమత్ప్రీతి కొఱకై ఇచ్చుచున్న యెడల ఐదు సంఖ్యలోనే దాని నీయవలెను.

శ్లో॥ అన్యం వక్ష్యామి మైత్రేయ కృపయా శ్రీ హనూమతః
సాలగ్రామ శిలామూర్తి స్వరూపం పరమాద్భుతమ్॥

తా. ఓ మైత్రేయా ! శ్రీ హనుమంతుని అనుగ్రహ మున వేఱొక పరమాద్భుతమైన విషయమును శ్రీ హనుమ త్సాలగ్రామ శిలామూర్తి లక్షణమును చెప్పుచున్నాను. విన వలసినది.

శ్లో॥ శిరసో దక్షిణేభాగే పృథుచక్ర సమన్వితః
త ద్వామే శరఘాతేన గోఖుర ప్రాద బంధురః॥

తా. హనుమత్సాలగ్రామము శిరస్సుయొక్క కుడి వైపు పెద్ద వర్తులాకారపు చక్రముతో కూడియుండును. ఎడమవైపున బాణపు దెబ్బతో చేయబడిన ఆవుగిట్టవంటి లోతగు భాగము కల్గియుండును.

శ్లో॥ సూక్ష్మపంజర సంయుక్తో మాలికా వాల సంయుతః
బహు శృంగయుత శ్చైవ సూక్ష్మ కార్ముక రేఖకః॥

తా. సూక్ష్మ పంజరముతోను, మాలికాకారమున వాలముతోను కూడి అనేక శిఖరములు కల్గి సూక్ష్మమగు ధనూరేఖ కల్గియుండును.

శ్లో॥ ముఖచక్ర ద్వయం సూక్ష్మ పుష్కరో మనురాకృతిః
సర్వసౌభాగ్యదో నృణాం హనుమా న్పురుషోత్తమః॥

తా. ముఖభాగమున చక్రద్వయము కల్గి సూక్ష్మమగు తామర పుష్పముతో నున్న నీ సాలగ్రామము మంత్ర స్వరూపమై జనులకు సర్వ సౌభాగ్యములిచ్చు పురుషోత్తముండగు హనుమంతుని రూపము.

శ్లో॥ సాలగ్రామో ఽయ మాఖ్యాతః హనుమన్మూర్తిసంజ్ఞకః
పురుషోత్తమ సుక్షేత్ర ఇతివ త్కల్ప వేదినః॥

తా. ఈ సాలగ్రామము హనుమన్మూర్తి పేరున ప్రసిద్ధమై యున్నది. అనగా పై రీతి నున్న సాలగ్రామము హనుమంతముగా తెలియదగినది. కల్పవిధానము లెరిగినవారిచే నిది పురుషోత్తమము, సుక్షేత్రము అని తెలియబడుచున్నది.

శ్లో॥ మందవారే హనూమంతం పూజయే ద్భక్తిపూర్వకం
బ్రాహ్మణా న్భోజయే త్పశ్చా దేకభుక్తవ్రతంచరేత్॥

తా. శనివారమున భక్తిపూర్వకముగా ఈ హనూమంతమగు సాలగ్రామమును ప్రత్యేకముగ పూజింపవలెను బ్రాహ్మణులకు అన్న సమారాధన మొనర్చి తాను ఒక్కపూట భోజనముతో నియమ మాచరింప వలెను

శ్లో॥ ఏవం యః కురుతే పూజాం హనూమద్వాసరే శుభే
తస్య ప్రసన్నో హనుమాన్ సర్వాభీష్టం ప్రయచ్ఛతి॥

తా. ఇట్లు హనుమత్ప్రీతికరమగు శుభప్రదమగు శనివారమున ఎవరు హనుమంతుని పూజింతురో వారియందు హనుమంతు డనుగ్రహము కలవాడై వారి కోరిక లన్నిటిని తీర్చును.

శ్లో॥ సకల కిసలయదానా దధికఫలప్రద మేకపుష్పదానం
స భవతి హనుమత్ప్రసాదమూలం
బహుకుసుమాదిషు నిశ్చలైవ భక్తిః॥

తా. ఎన్నో పత్రములను తెచ్చి పూజించుటకంటె ఒక్క పుష్పమైనను భక్తితో సమర్పించినచో ఎక్కువ పుణ్యఫలమునిచ్చును. అనేక కుసుమముల కంటె నిశ్చలమగు భక్తియే నిజముగ హనుమదనుగ్రహము పొందుటకు కారణమగును. కావున అనన్య భక్తి సర్వప్రధానము.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
హనుమన్మంత్ర వివరణే హనుమత్పూజా
సాధన ప్రకాశ కథనం నామ
ఏకోనపంచాశత్పటలః

# పంచాశత్పటలః

## భీమసేన చరిత్ర కథనం

శ్లో॥ మైత్రేయ! శృణు వక్ష్యామి భూయోఽపి హనుమత్కథాం
తస్మిన్నపేక్ష్య భక్తిం తే నోపరన్తు మహం క్షమః ॥

తా. శ్రీ పరాశరుల వారు చెప్పుచున్నారు- ఓ మైత్రేయా! మరల హనుమత్కథను వేఱొక దానిని చెప్పుచున్నాను వినవలసినది. నీకు ఆ హనుమంతుని గూర్చి చెప్పుట నాపివేయజాలను.

శ్లో॥ కో వా సమర్థో మైత్రేయ! సమున్మజ్జతు మంజసా
పరీవాహోద్భుతే మగ్న స్తత్కథామృతసాగరే॥

తా. ఓ మైత్రేయా! ఆ హనుమంతుని కథ అనునట్టి అమృత సముద్రముయొక్క అద్భుతమైన ప్రవాహమున మునుగుచు వెంటనే లేచి ఎవడు వచ్చును?

శ్లో॥ కో వా భవేత్ క్షమో జన్తు రపి వాక్పతి సన్నిభః
నిశ్శేష మంజనాసూను గుణవ్యాఖ్యాన కర్మణి॥

తా. బ్రహ్మదేవుడంతటివాడైనా హనుమంతుని గుణములను పూర్తిగా వర్ణించి ఎవడు చెప్పగలడు?

శ్లో॥ తథాపి రసనావత్త్వా ద్వృథా మతి విజృంభణం
శక్త్యై రున్మజ్జ్య కృచ్ఛ్రేణ పిబ న్వక్ష్యే కథామృతమ్॥

తా. అయిననూ రుచియందు, చెప్పుటయందు తగిన నాలుక యున్నందున, బుద్ధి విజృంభించిన మేరకు కష్టమైనను అమృత ప్రవాహమునుండి లేచి అమృతధారలను గ్రోలుచు హనుమత్కథను చెప్పెదను.

శ్లో॥ ఆసీ త్కశ్చి న్మహారాజో విజితారాతి మండలః
ధర్మరాజ ఇతి ఖ్యాతో ధర్మరాశి రివాపరః॥

తా. పూర్వము ధర్మరాజను పేరుగల మహారాజు వుండెను. ఆతడు శత్రువులందఱను జయించినవాడు, అపర ధర్మరాశి వంటివాడు.

శ్లో॥ చతుర్భి రనుజై శ్శూరై ర్భీమార్జున పురోగమైః
రేజే పరివృతో నిత్యం చతుర్భుజ ఇవాచ్యుతః॥

తా. ఎప్పుడూ భీమార్జున నకుల సహదేవులను పరాక్రమవంతులగు నల్గురు సోదరులతో కూడి చతుర్భుజుడగు విష్ణువవలె ప్రకాశించెను.

శ్లో॥ హస్తినాఖ్యే పురే తిష్ఠః యుగే ద్వాపరి నామని
గుణై ర్మనాంసి నిర్దోషైః ప్రజానా మనురంజయన్॥

తా. ద్వాపర యుగమున హస్తినాపురమందు సద్గుణవంతుడై నిష్కల్మషమగు మనస్సుతో పాలించి ప్రజల నానందపఱచు చుండెను.

శ్లో॥ పిత్రా నివేదితో పూర్వం పాండురాజేన ధీమతా
శశాస సకలాం పృథ్వీం పృథాయాం ప్రథమం సుతః॥

తా. కుంతీదేవియొక్క పెద్దకుమారుడగు ధర్మరాజు ధీశాలియు తండ్రియునగు పాండురాజుచే పూర్వము తెలియ జేయబడినవాడై భూమినంతను పరిపాలించెను.

శ్లో॥ స కదాచి న్మహారాజో రాజసూయేన వీర్యవాన్
యష్టుం సముపచక్రామ విక్రమాక్రాంత భూమిపః॥

తా. శౌర్యముచే ఆక్రమింపబడిన భూమికల ఆ పరాక్రమశాలియగు ధర్మరాజు ఒకప్పుడు రాజసూయ మహాయజ్ఞముచేయ సమకట్టెను.

శ్లో॥ తత్ర సత్యే మహాధర్మే ధౌమ్యప్రముఖ కారితే
ఆభుంజ్య తాతి శుభ్రాణి శాలీయాన్నాని మానవైః॥

తా. అచ్చట ధౌమ్యుడు మున్నగు పురోహితులచే చేయించబడు ఆ యజ్ఞమునందు మనుష్యులకు పరిశుభ్రములగు శాలిధాన్యము యొక్క అన్నముతో సంతర్పణము జరిగెను.

శ్లో॥ మృదూని స్వాదుసూపాని నానా శాకాంకితా న్యపి
సంపూర్ణాని చ భక్ష్యాణి భోజ్యాని వివిధానిచ॥

తా. మృదువైన, మెత్తనైన పప్పులు వాటితో కూడిన వివిధములైన కూరలు, సమస్త భక్ష్యములు' అనేక విధములగు భుజింపదగు పదార్థములు-

శ్లో॥ అసంఖ్యాని చ చోష్యాణి లేహ్యాని మధురాణి చ
సౌరభానుగత భోజ్యాని గోఘృతాని నవాన్యపి॥

తా. లెక్కలేనన్ని చోష్యములు (పీల్చదగు పదార్థములు) తీయనైన లేహ్యములు (నాకదగిన పదార్థములు) మంచివాసనలతో ఉడికిన పదార్థములు, లేగట ఆవులపాలు

శ్లో॥ క్షీరాణి చ మహార్హాణి సుధా స్పర్థి రసాని చ
శారదేన్దువ శుభ్రాణి సంపూర్ణాని దధీ న్యపి॥

తా. గొప్ప అర్హత గల్గినపాలు, అమృతమును తిరస్కరించజాలు రసములు, శరత్కాలపు పూర్ణచంద్రునివలె శుభ్రములై తెల్లనైన పెరుగులును,

శ్లో॥ బ్రాహ్మణైః క్షత్రియై ర్వైశ్యైః శూద్రై స్సంకీర్ణకై రపి
పురన్ధ్రీభిః పురస్థాభి రాగతాభి స్తత స్తతః॥

తా. బ్రాహ్మణులచేత, క్షత్రియులచేత, వైశ్యులచేత, శూద్రులచేత, సంకరజాతులవారిచేత, స్త్రీలచేత, పట్టణమందుండు ఆడువారిచేత, ఇంకను అచ్చటకు వచ్చిన అందఱిచేత–

శ్లో॥ యథారుచి యథేష్టం చ భుక్తాని బ్రాహ్మణోత్తమైః
అగణ్యా స్తత్ర భోక్తారో బ్రాహ్మణా వేదపారగాః॥

తా. ఉత్తమ బ్రాహ్మణుల చేతను ఇష్టమైన పదార్థములు ఇష్టమువచ్చినంతగా భుజింపబడినవి. వేదమంతయు నెఱిగిన బ్రాహ్మణులే లెక్కకు మిక్కిలిగా అక్కడ భుజించిరి.

శ్లో॥ ఇతరే కిం పునర్మర్త్యా అసంఖ్యా సికతా ఇవ

తా. ఇంక ఇతర జనుల విషయము చెప్పనదేమి ? వారందరు ఇసుకవలె అసంఖ్యాకులుగా వచ్చి భుజించిరి.

శ్లో॥ ఏవం ధర్మతనూజేన క్రియమాణే మహాక్రతౌ
దధ్యౌ తదనుజో భీమః కిం విధేయం మయాధునా?॥

తా. ఇట్లు ధర్మరాజుచే చేయబడు మహావ్రతమున ఆతని తమ్ముడగు భీముడు ఇట్లాలోచించెను. ఇప్పుడు నే నేమిచ్చిన బాగుండును ?

శ్లో॥ రత్నగర్భాపతే రస్య న రత్నం దాన మర్హతి
సర్వకామదుఘా ధేను స్సురాణాం భువి దుర్లభా॥

తా. రత్నగర్భయగు భూమికే పతియగు ఈతనికి రత్నమిచ్చుట తగదు. కోరికలన్నిటిని ఇచ్చు దేవతల కామధేనువు భూమిపై లభించునది కాదు.

శ్లో॥ కిన్తు యద్దుర్లభం భూమౌ యచ్చ రాజ్ఞో యశస్కరం
బలా దాహృత్య తద్దేయం దీయా త్తమితి సాంప్రతం॥

తా. కాని భూమియందు లభింపని దేదియో, దేని వలన రాజునకు కీర్తి వచ్చునో దానిని శక్తిచే సాధించి తెచ్చి ఈయవలెను అని తలచి-

శ్లో॥ సంచారా త్పురుషమృగస్య భుక్తశాలా
స్సమ్మృష్టా స్త్రిదివనికేతనస్య కుర్యాం
ఆనేయంత మితి విభావ్య భీమసేనో
నిష్క్రాన్త స్స వనగృహాద్వ్యయూహ సుధర్మాం॥

తా॥ స్వర్గమందు పురుష మృగముయొక్క సంచారము వలన భోజనశాల లెల్లప్పుడు పరిశుద్ధముగా నుండును. కావున దానిని తేవలయునని భీముడు నిశ్చయించుకొని యజ్ఞశాలనుండి దేవసభయగు సుధర్మకు వెడలెను.

శ్లో॥ అజ్ఞాయ స్వబలమదాన్ధ దృష్టిపాత
స్త్వద్వేగం జితమనసం స్వఘాతుకం వా
అజ్ఞాత స్వగత విశేష బంధులోకః
స్వస్థానా త్ప్రపది చచాల భీమసేనః॥

తా. తన బలమును చూచుకొనిన మదమువలన కనుగప్పినవాడై మనసునుమించి తనకు ప్రమాదము కల్గింపజాలినంత వేగమును కూడ గుర్తించక తనకుగల విశేష బంధువర్గముకూడ గుర్తించనివాడై భీమసేనుడు ఉన్న చోటునుండి ఒక్కమాటుగా వెడలెను

శ్లో॥ ఏవం వ్యవసితే తస్మిన్ సర్వభూతదయాపరః
సాహాయ్య మనుజే కర్తుం హనూమా నైచ్ఛ దగ్రజః॥

తా. ఇట్టి కష్టమగు పనికి భీముడు పూనుకొనగా సర్వప్రాణులయందు దయగలవాడు, భీమునికి అన్నయగు హనుమంతుడు ఆతనికి సహాయపడ దలచెను.

శ్లో॥ గచ్ఛత స్తస్య వేగేన భీమసేనస్య వర్త్మని
కపీంద్రో ఽజగరాకారః క్షణా త్ప్రాదు రభూ త్పురః॥

తా. మిక్కిలి వేగముగా వెళ్ళుచున్న భీమసేనుని త్రోవలో క్షణములో కొండచిలువ వంటి ఆకారముకల హనుమంతుడు ఎదురుగా నుండెను

శ్లో॥ వాలే నావృత్య పంథానం శివలింగమహాత్మనా
దూరాది వాధ్వన శ్శ్రాన్తో నిశ్వసన్ పవనాత్మజః॥

తా. వాయునందనుడు బాటను శివలింగ మయముగ తోంచు తోకతో ఆవరించి దూరము ప్రయాణము చేయుటచే అలసినవానివలె నిశ్వాసలు వీడుచు నుండెను.

శ్లో॥ తం తథావిధ మాలక్ష్య విరుద్ధసరణిం కపిం
భీమో జగాద భీమాత్మా మృగానయన సత్వరః

తా. ఆ విధముగా అడ్డముగానున్న హనుమంతుని చూచి మృగమును తెచ్చుటకై త్వరపడు భయంకర రూపుడగు భీముడు ఇట్లు పలెక్కను-

శ్లో॥ జరత్కపే! సముత్క్షిప వాలం చాలయ వర్త్మనః
గంతవ్యం తు మహాక్షిప్ర మితోఽవసర సత్వరః॥

తా. ఓ ముదుసలి కోతీ! తెమ్మ త్రోవకడ్డముగానున్న తోక తీసివేయుము నేను అవసరమగు పనిపై అతి వేగముగా ఇటు వెళ్ళవలసి యున్నది.

శ్లో॥ మర్కట ప్రకృతిం నూనం స్థవిరోఽపి న ముంచతి
యద్గన్తవ్యపదం కృత్స్నం వాలే నావృత్య తిష్ఠసి॥

తా. ముసలివాడవైనను కోతిచేష్టలు మానలేదు. ఇట్లు వెళ్ళవలసిన బాటను తోకతో ఆవరించి కూర్చున్నావు.

శ్లో॥ కిం తవా స్తిమితా దేశే వన్యాహార వివర్జితే
గచ్ఛ సాంప్రతం దేశం మధురం సలిలం పిబ
భక్ష యామ్రఫలా న్యద్య పక్వాని మధురా ణ్యపి॥

తా. వన్యములగు ఆహారములు లేమియులేని ఈ సరిహద్దు ప్రదేశములో నీకు పని యేమున్నది ? సరస్వతీ నదీ తీర ప్రదేశములకు వెళ్ళుము. తీయనైన నీరు త్రాగుము. బాగుగా పండి తీయగానుండు మామిడిపండ్లను తినుము.

శ్లో॥ ఇతి సంచోద్య మానోఽపి భీమే నావర జేన సః
న చచాల తతో దేశా ద్వ్యజయ న్వృద్ధచేష్టితమ్॥

తా. అని తమ్ముడగు భీముడు బోధ చేసినను హనుమంతుడు ముదుసలితనమును వ్యక్తము చేయు చేష్టలతో అక్కడనుండి కదలలేదు.

శ్లో॥ అథాఽబ్రవీ త్ప్రియం వాక్యం తద్వ్యపత్తి నివర్తకం
జిజ్ఞాసు ర్విక్రమం తస్య భీమం భీమాగ్రజః కపిః॥

తా. పిమ్మట భీముని అన్నయగు హనుమంతుడు భీముని పరాక్రమమెఱుగు కోర్కె కలవాడై ఆతని బాధను తొలగించునట్లు ఇష్టమైన మాట నిట్లు పల్కెను -

శ్లో॥ రాజన్ జీర్ణ శరీరోఽహం వన్యాహార వివర్జితః
పిపాస యార్తితో నిత్యం న జానే త్రిదినం పయః

తా. ఓ రాజా ! వన్యములగు ఆహారములు లేనివాడనై శుష్క శరీరుడ నైతిని. ప్రతిరోజు దాహముచే పీడింప బడుచు మూడురోజులుగా నీటి నెఱుగక యుంటిని.

శ్లో॥ భవాదృశో మహాధన్యో మాసాత్పూర్వ మిహాగతః
మహ్యం వితీర్య వన్యాని ఫలాని వివిధాని చ॥

తా. సేవంటి పుణ్యాత్ముడు నెలకింకట ఇచ్చటకు వచ్చెను. అతడు వివిధములైన పండ్లను వనమందలి వానిని ఇచ్చి-

శ్లో॥ అశక్తం మాంస ముల్లంఘ్య నిర్యయా వమునాపథా

తా. శక్తిహీనుడనై కదలలేకున్న నన్ను దాటి వెడలిపోయెను.

శ్లో॥ వృద్ధ స్యార్తస్య బాలస్య స్త్రీణాం చైవ విశేషతః
భృత్యభావస్య వై పంథా ఇతి శాస్త్రవిదో విదుః॥

తా ముదుసలివానికి, బాధయందున్నవానికి, బాలునకు విశేషించి స్త్రీలకు సేవకభావము కలవారికే మార్గమని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

శ్లో॥ త త్త్వయా రాజశార్దూల జలం దేయం పిపాసి తే
పాహి మా మీదృశం దీనం గమిష్య న్త్యసవో మమ॥

తా. కావున ఓ రాజశ్రేష్ఠుడా ! దప్పిక గొనియున్న నాకు నీటినిమ్ము నా ప్రాణములు పోవుచున్నవి. ఇట్టి దీనుడనగు నన్ను రక్షింపుము.

శ్లో॥ పాయయిత్వా పయః పానం జీవనం చావధార్య మే
తత్కళేబర మాలంఘ్య గచ్ఛ రాజన్ యథాసుఖమ్।

తా. ఓ రాజా ! నాకు దాహముతీర్చి నా ప్రాణములు నిల్పి ఈ దేహమును దాటి నీ ఇచ్ఛవచ్చినటుల వెళ్ళుము.

శ్లో॥ అథవా దీర్ఘరోమాణం వృథా స్థూలం చ వాలధిం
అంగుష్ఠేన సముత్థాప్య త్వదీయే నాన్యతః క్షిప॥

తా. లేదా పొడవగు వెంట్రుకలు కల్గి వ్యర్థముగ బలిసిన ఈ తోకను నీ బొటన వ్రేలితో ఎత్తి వేఱొకవైపు నెట్టుము.

శ్లో॥ యద్వా పుచ్ఛం పరిభ్రామ్య తుచ్ఛ స్వచ్ఛమనా వ్రజ
సర్వథా నాహ ముత్థాతుం శక్తః కంఠగతాసురః ॥

తా. లేదా తోకను తిప్పి విసరి హాయిగా వెడలుము మెడపై రాక్షసు డున్న నేను లేచుటకే రీతిని సమర్థుడకాను.

శ్లో॥ ప్రాణేన గత్వా తే ప్రాణాః మమ త్రాణ మపశ్యతః
కిన్తు సంస్థాపితా స్థైర్యం ధర్మాత్మ న్భవ దీక్షయా॥

తా. నా ప్రాణములు పోనున్నవి కూడ రక్షకుడవగు నిన్ను చూచి స్థైర్యము నందినవి. కావున ఓ ధర్మాత్మా! నీవు నన్ను రక్షించుటలో దీక్ష కలవాడవగుము.

శ్లో॥ సమర్థోఽసి మహారాజన్ మయి దీనే దయాం కురు
దీనదుఃఖసహా స్సన్తో న శక్తా హి విమత్సరః॥

తా ఓ మహారాజా ! నీవు సమర్థుడవు. దీనుడ నయిన నా యందు దయ జూడుము. సత్పురుషులు దీనులు, దుఃఖితులయినవారితో సహాయులుగా నుందురు మాత్స ర్యము కలవా రందుకు సమర్థులు కారు.

శ్లో॥ ఇత్యాకర్ణ్య వచ స్తస్య కరుణం కరుణానిధిః
తం వృద్ధ మన్మన్య తే కర్తు మియేష సఫలోదకే॥

తా. దయామయుడగు భీము డాతని దీనాలాపములు విని ఆ వృద్ధుని రూపమున నున్న హనుమంతునకు పండ్లు, నీరు కల్గునటు చేయదలచెను.

శ్లో॥ అస్పృశ్య ప్యా కపి మస్పృశ్యం దండే నోద్ఘాటయ న్నథః
స నోత్పాటయితుం శేకే భగ్న ముద్గర విహ్వలః॥

తా. స్పృశించుటకు తగనివాడుగా నున్న వృద్ధ వానరుని తాకకుండగనే క్రిందనుండి గదయొక్క కఱ్ఱతో లేపుటకు మత్నించి ఆ గదయొక్క దండము విరుగుటచే భయము నందుచు ఆతనిని యెత్తుటలో విఫలుడయ్యెను.

శ్లో॥ సరణి ప్రతిరోధేన దీర్ఘ ముష్ణం సనిశ్వసన్
ఈప్సితార్థ విలంబేన కృతామర్షాభవ త్కపౌ॥

తా. మార్గము నిరోధింపబడుటచే తన కోరిక నెర వేర్చుకొనుట కాలస్య మగుచుండుటచే వేడి నిట్టూర్పులు విడుచుచు ఆ కోతియందు మిక్కిలి కోపమందెను.

శ్లో॥ విలంఘ్య ప్లుతగత్యేమం గచ్ఛేయం వికతక్లమః
ఆనయిష్యే మృగం మార్గా దితి చక్రే మతి నృపః॥

తా. ఈతని నుండి దూకి ఈ కష్టము నుండి తొలగి పోయెదను. ఆ మృగమును మార్గమునుండే తీసికొని రాగలను అని భీముడు తలచెను.

శ్లో॥ అథ విజ్ఞాయ సర్వజ్ఞః స్వాత్మలంఘన నిశ్చయం
మారుతి ర్వర్ధయాం చక్రే స్వవాలం స్వకళేబరం॥

తా. పిమ్మట సర్వజ్ఞుడగు హనుమంతుడు తనను దాటుటకు భీముడు సిద్ధముగా నున్నాడని తెలిసి తన తోకను, తన దేహమును పెంచ మొదలిడెను.

శ్లో॥ తతో వాలం తు లోకానాం విలంఘయిషు రాత్మవాన్
పశ్చా దాక్రమ్య వేగేన ధావతిస్మ నృపాత్మజః॥

తా. పిమ్మట భీముడు అట్లు లోకముల నతిక్రమించు కోర్కెతో పెరుగుచున్న తోక వెనుక వేగముగ పరుగిడ జొచ్చెను.

శ్లో॥ దూరా దభ్యాసమభ్యేత్య దృష్ట్వా స్వ మ్మశకోపమం
అభ్రంకష కపే రగ్రే లజ్జా నమ్రముఖోఽభవత్॥

తా. పిదప దూరమునుండి సమీపమునకు వచ్చి ఆకాశమునంటు ఆ హనుమంతుని ముందు దోమవలె నున్న తనను చూచుకొని సిగ్గుచేత తలవంచుకొనెను.

శ్లో॥ అథ ధైర్యం సమాలంబ్య నిశ్చయాయ గతోచ్ఛ్రియః
ఇమం ప్రదక్షిణీకృత్య సాధయిష్యామిసాధ్వితిః॥

తా. పిమ్మట పొడవును గూర్చి ఒక నిశ్చయానికి వచ్చినవాడై ఈతనికి ప్రదక్షిణము చేయుటద్వారా సాధింతును. అట్లయిన బాగుండు ననుకొని–

శ్లో॥ అథ ప్రదక్షిణీకర్తుం చర న్పవనరంహసా
న లేభే వాలధేః పారం న మూర్ధ్నశ్చ కపే నృపః॥

తా. పిదప ప్రదక్షిణము చేయుటకై వాయువేగముతో వెడలుచు భీముడు ఆ వానరముయొక్క తలకు కాని, తోకకు కాని అంతము చూడలేకపోయెను.

శ్లో॥ అథ భీమో గదాం త్యక్త్వా ధిక్కృత్య నిజవిక్రమం
కపయే వృద్ధరూపాయ సాష్టాంగం ప్రణతోఽభవత్ ॥

తా. పిమ్మట భీముడు గదను విడచివైచి తన పరాక్రమమును నిందించుకొని ముదుసలి రూపమున నున్న కోతికి సాష్టాంగ నమస్కారము లొనర్చెను.

శ్లో॥ అబ్రవీచ్చ కపిశ్రేష్ఠం లజ్జా గద్గదయా గిరా
క్షన్తవ్యో మేఽపరాధోఽయం త్వామివాజానిషం కపిమ్

తా. హనుమంతునితో సిగ్గువలన గద్గదికమైన వాక్కు కల్గి ఇట్లు పల్కెను- నీవుగా తెలియని నా తప్పును క్షమింపుము.

శ్లో॥ నాజానిషం మహాత్మానం విశ్వవ్యాపిన మీశ్వరం
ప్రసీద సౌమ్యరూపేణ యేన నిర్వృతి మాప్నుయామ్॥

తా. ప్రపంచమంతయు వ్యాపించిన మహాత్ముడగు పరమేశ్వరునిగా తెలియని నన్ను సౌమ్యరూపుడవై అనుగ్రహింపుము. దోషమును పోగొట్టుకొను మార్గము ననుగ్రహింపుము.

శ్లో॥ బాలభావేన మే మూఢా బుద్ధి రాసీ దసమ్మతా
మనుష్యాగజో మహారాజో యజతే ధర్మనందనః

తా. కాన నా మనస్సును గదను, వ్యర్థమగు శ్రమ కల ఈ గదను త్యజించి నాపై ప్రేమలేని నిన్ను చూచుచు ఇక ఉత్తరపు దిక్కునకే అనగా మరణించుటకే పోవుదును.



శ్లో॥ ఏవ ముక్త్వా మహాభాగో ధర్మరాజానుజో బలీ
విరరామ రమానాథం ధ్యాయన్ హృదయపంకజే॥

తా. అని మహామహుడు, బలవంతుడు, ధర్మరాజు ని తమ్ముడు అయిన భీముడు పల్కి మనసునందు లక్ష్మీపతి యగు విష్ణువును తన హృదయ పద్మమున ధ్యానించుచు ఊరకుండెను.



శ్లో॥ ఇతి సకల జగన్మయం కపీంద్రం
ప్రియవచనేన నిజోన్ముఖం విధాయ।
పురుషమృగ నిరీక్షణాయ భీమః
సపది సముత్సుక మానసో బభూవ॥

తా. అని సకల జగన్మయుడు కపిశ్రేష్ఠుడు అగు హనుమంతుని తన ప్రియ వచనములచే సుముఖునిగా జేసికొని భీముడు పురుష మృగమును నిరీక్షించుటలో ఉత్సుకతనందిన మనస్సు కలవాడయ్యెను.



ఇతి శ్రీ పరాశరసంహితాయాం
పంచముఖ హనుమద్వివరణే, పరాశర మైత్రేయ సంవాదే
భీమసేన చరిత్ర కథనం నామ
పంచాశత్పటలః

—: సమాప్తః :—

# దాతలు

విజయవాడ :—

శ్రీమతి సుద్ధపల్లి రాజ్యలక్ష్మి
శ్రీ వేదాన్తం లక్ష్మీధరేశ్వర శర్మ
శ్రీమతి కాకరపర్తి రంగమ్మగారి జ్ఞాపకార్థం
పుత్రుడు శ్రీ సీతారామయ్య
శ్రీ సుద్దపల్లేటి మోహనరావు
శ్రీమతి మాగంటి శారద
శ్రీ భట్లపెనుమర్తి కృష్ణమూర్తి
డా॥ యం. వెంకటరామారావు
గం॥స॥ కందికొండ వరలక్ష్మి

హైదరాబాదు :—

శ్రీ టి. మల్లిఖార్జునరావు
శ్రీ కె. సురేష్‌బాబు
శ్రీ ఎ. రంగాచార్యులు
శ్రీ బి.వి.కె. శర్మ
శ్రీ టి. పి. ఆంజనేయమూర్తి
శ్రీ డి. వి. ఎస్. రావు
శ్రీ వి.పి. కుటుంబరావు
శ్రీ ఎస్. సూర్యనారాయణ
శ్రీ యం. వీరభద్రరావు

| | |
|---|---|
| శ్రీ పి.వి. సుదర్శనాచార్యులు | 10 |
| శ్రీ కె. యస్. ప్రకాశరావు | 10 |
| శ్రీమతి పి రాజేశ్వరమ్మ | 10 |

ఇతర ప్రాంతములు :—

| | |
|---|---|
| శ్రీ శ్రీగిరిరాజు శేషగిరిరావు, గుండ్లపల్లి | 116 |
| శ్రీ గుడివాడ హనుమంతరావు, తెనాలి | 116 |
| శ్రీ కంభంమెట్టు మధుసూధనరావు, బాపట్ల | 116 |
| శ్రీ కంభంమెట్టు ప్రభాకరరావు, బొంబాయి | 116 |
| శ్రీ కె. మునిరత్నం, తిరుపతి | 25 |
| చి॥ టి. ఆర్. స్వామి, ఢిల్లీ | 25 |
| 'శ్రీరామశరణ్' శ్రీ కుందుర్తి వెంకట నరసయ్య, బుద్ధాం | 25 |
| శ్రీ అవ్వారి శ్రీరామమూర్తిగారి పుత్రులు చి॥ శివరామప్రసాదు, చి॥ శివసుబ్రమణ్య ప్రసాదు, గుంటూరు | 25 |
| శ్రీ బోళ్ళమల్లయ్య. రాజమల్లమ్మగార్ల పుత్రుడు శ్రీ పాపయ్య, కరీంనగరము | 11 |
| శ్రీ వేమూరు బైరాగయ్య, చిలుమూరు | 10 |
| చి॥ పొన్నపల్లి పవన్‌కుమార్, కొరుూరు | 10 |
| చిలుమూరు శ్రీరామారూరల్ కాలేజి విద్యార్థులు చి॥ కొండపనాయుడు దామోదరరావు, చి॥ కృష్ణమోహన్, జగదీషు, సుబ్రహ్మణ్యం | 10 |